ఆంధ్ర విశ్వకళాపరిషద్ గ్రంథమాల

( 15-వ ప్రచురణము )

శ్రీరస్తు

# వైయాకరణపారిజాతము

---

ఆంధ్రవిశ్వకళాపరిషత్

కళాశాలా పండిత

వజ్ఝల చినసీతారామస్వామిశాస్త్రి

విరచితము.



వాల్తేరు

1937

మద్రాసు

ఆనందముద్రణాలయమునందు

ముద్రితము.



---

# కృతిసమర్పణ శీర్షరత్నములు.

సీ. సర్వసర్వంసహా ధూర్వహో త్తేజక
తేజుఁ డే పద్మకోద్దీపకుండు
భారతసామ్రాజ్య శూరసేనాని యం
చలరు నేఘను "కే. సి. ఐ. ఇ" బిరుద
మానరబుల్ బిరుదాన సార్థకముగా
మన్నింతు రాంగ్లసమ్రాట్టు లెవనిఁ
జెన్నపురీరాష్ట్ర సింహాసనాధ్యక్షు
సచివాగ్రగణ్యుఁ డేశక్తిశాలి
ప్రథితాంధ్రవిశ్వకళాపరిషత్తు పో్రి
ఛాన్సల రేభూపసత్తముండు
వైరిగోవృషభాల పాలింటి బెబ్బులి
బొబ్బిలి నేలు నే భూతలేంద్రుఁ

తే-గీ. డట్టి-సర్-రాజ-రావు శ్వేతాచలపతి
రామకృష్ణరంగారావు రాజచంద్ర
మో మహాప్రభుశేఖరు నోముఁగాతఁ
బ్రీతి శ్వేతాద్రిపతి రామకృష్ణ విభులు.

{ శీర్షము = సీసము.
పద్మక = పద్మము,
పద్మక వంశము. }

సీ. కవిసార్వభౌముండు గణుతింపఁగాఁదగు
సాహిత్యసామ్రాజ్యచక్రవర్తి
రావుసర్వజ్ఞ సింగావనీకాంతుండు
పార్థివాగ్రణి మీాదు వంశకర్త
కారుణ్య మిత్రతా వీరతా ప్రభుతలఁ
దనియించి రంగవాకను జయించి
మెహరుబాన్. దోస్తాన. బహదరు. సాహాబు
రంగరా వాది కోత్తుంగవంశ్య
బిరుదాల 'పాదుషా' గురుతఁ జూపఁగఁ గాంచు
పెదరాయ లింగప వేంకటేంద్ర

భువనేశు లవనీశ భవదీయ వంశంపు
ముక్తాఫలంబులై పొగడు గనిరి
వేలకువేలిచ్చె వేణుగోపాల సీ
తారామ దేవతాగారములకు
శాశ్వతస్థితిగ యాష్టాకవృద్ధప్రపి
తామహ శ్వేతాద్రి ధరణి విభుఁడు
విద్యాప్రియుం డాంధ్రవిశ్వకళాపరి
షద్గౌరవాధ్యక్ష సత్తముండు
మీతాత వేంకట శ్వేతాచలేశ్వరుం
డాంధ్రగీర్వాణ వృద్ధ్యర్థమర్థి
లక్షరూప్యము లీయ రాజేంద్ర పరిషత్తు
ప్రచురించు నిట్టి సద్గ్రంథశతము
జనరంజనంబునం జనకవాక్పాలనం
బున రామదేవుఁ డన్ పొగడు గనిన
శ్రీవేంకట కుమార కృష్ణ రంగారావు
జగతీశ్వరుండు మీ జనకుఁ డీశ
సర్వవిధంబులం బూర్వరాజాతిగ
లోకోత్తర గుణోత్తరుండ వౌచు
శౌర్యధైర్యౌదార్య వీర్యగాంభీర్య సు
స్థైర్య ధీరోదాత్త చర్యుఁడౌచు
నుత్తరోత్తరవృద్ధి * నుదిత ముదితముగాఁ
గుల ముద్ధరించు సద్గుణుఁడ వౌచు
నసహాయశూరత కద నిది గాదంచుఁ
బెనఁగు జస్టిసుపార్టి విభుఁడ వౌచు
నాంగ్లేయ సార్వభౌ మానుకూల్యంబున
రాజభక్తికిని దార్కాణ వౌచు
దీనాసమర్థ ప్రజానురంజనముగాఁ
బాలించు రాజతా శాలివౌచుఁ

* "ఇదం వో యాజ్యానా ముదిత ముదితం యత్కుల మభూత్"
(అనర్ఘరాఘవము, ౧ అంకము.)

తే-గీ. బరఁగు విద్వత్కవీశ్వర పారిజాత
జగతి వైయాకరణ పారిజాత సుమము
కృతిని గాన్కఁగ నీకు నంకితమొనర్తుఁ
గొనుము జయమంగళంబులం గనుము చిరము. ౨

మ. సరసత్వంబు నుదారతాగరిమయున్ సద్గుణ్యముం గల్గు భూ
వర చంద్రుండు వరుండు సత్కృతికి సంప్రాప్తించు భాగ్యంబు బం
గరపుం భూషకు రత్నసంఘటనభాగ్యంబంచు శ్రీ రెడ్డిరాట్
పరిషత్స్వామి విమర్శకాగ్రణి ఘటింపం గల్గెఁగాదే భవ
ద్వరతాలాభము తావకీనపదవీధామంబు సామాన్యమే. ౩

ఉ. భూమిసుతాధినాథు పరిపూర్ణ కృపామహిమంబునం భువిం
దామర తంపరై వెలయుతం భవదీయకులంబు; రాజ్యమున్
శ్రీమగులంగ విస్తృతిని జెందుఁ; దగున్ నెల మూఁడు వర్షముల్
సేమము పాఁడి పంటయు నశేష జనోన్నతి నీదు మండలిన్. ౪

శ్లో. వాగ్దేవతాం కమలభూ ర్వదనేన యావ
ద్యావచ్చ లోకజననీం హృదయేన విష్ణుః
అంగేన శంభు రపి యావ దుమాం దధాతి
తావ ద్దధాతు విభు రేష చ రాజ్యలక్ష్మీమ్. ౫

ఇట్లు,
కృతిసమర్పించు విధేయుఁడు
గ్రంథకర్త,
వజ్ఝల చినసీతారామస్వామిశాస్త్రి

విశాఖపట్టనము.
10-12-1936.

# విజ్ఞప్తి

విచక్షణులారా, ఆంధ్రశబ్దచింతామణి నన్నయభట్టారక విరచితమని యు నయ్యది యాంధ్రవ్యాకరణప్రపంచమునఁ బ్రాథమిక మగుటంజేసి సంస్కృతసమ శబ్దానుశాసనము ప్రధానముగను నచ్ఛాంధ్రభాషానుశాసన మప్రధానముగను రచింపఁబడినదనియు నద్దానియందలి పరిశిష్టవిషయములను విపులముగఁ బూరించుటకయి యథర్వణాచార్యునిచే వికృతివివేక మనెడి యథర్వణకారికావళి రచింపఁబడినదనియు నా రచించియున్న చింతామణి విషయపరిశోధనమున విపులవిమర్శన పురస్సరముగ సిద్ధాంతీకరించి యుండు టచే నిట మరలఁ దద్విషయక విమర్శనము చేయుట యనావశ్యకము. అట్టి నన్నయాథర్వణ గ్రంథములను జోడించి యావశ్యకతనుబట్టి యితరలక్షణ గ్రంథభాగములను నా రచించిన కారికలను నచ్చటచ్చటఁ జేర్చిన నన్నయా థర్వణీయ మనెడి మహాకవిప్రయోగమూల కాంధ్రభాషాస్వరూప నిరూపక మగు గ్రంథమును మూలముగఁగొని యద్దాని కితరాంధ్రలక్షణగ్రంథ ప్రపంచపరిశీలన పూర్వకముగను, వైదిక లౌకిక సంస్కృతభాషా వ్యాకరణ సంబంధ పరిశీలనపూర్వకముగను, ప్రాచీన మహాకవిప్రయోగ ప్రపంచ ప్రదర్శనపరిశీలన పూర్వకముగను, నితర ద్రావిడభాషాసంబంధ విశేష విమర్శనార్థక తొల్కాప్య కర్ణాటభాషాభూషణాది ద్రావిడవ్యాకరణ విషయ ప్రదర్శన పరిశీలన పూర్వకముగను, విపులమగు వ్యాఖ్యానముచేయుట యే తద్గ్రంథ పరమోద్దేశము. ఆంధ్రభాషా వాఙ్మయ కూలంకషపాండిత్య సంపత్తికి "శాస్త్రమ పౌరుషమాద్యం। ప్రాయికనిత్యప్రయోగలక్ష్మైతత్। దృశ్య" మిత్యాది నన్నయభట్టారక సూక్తిచొప్పున వ్యాకరణ సంస్కార సంస్కృత సంస్కృతభాషావాఙ్మయ పరిజ్ఞానమేగాక యితర ద్రావిడభాషా వైదుష్యమును నత్యావశ్యకమనుటలో విప్రతిపత్తిలేదు.

గ్రాంథికాంధ్రభాషాస్వరూప నిరూపణవిషయమునఁ గథావస్తునిర్వ హణ పరతంత్ర ప్రాచీనమహాకవి గ్రంథములలోని కవిప్రయుక్తములె యని విశ్వసింపఁదగిన సాధారణముగా మార్పరాని స్థలములందలి ప్రయోగ విశేషములతోపాటుగఁ బ్రాచీనగ్రాంథికాంధ్రభాషానుశాసనైకతానములగు నాంధ్రశబ్దచింతామణి వికృతివివేకాది ప్రాచీనలక్షణ గ్రంథములును బ్రాచీనమహాకవికృతములె యగుటంజేసి పరమ ప్రామాణికము లనుట నిర్వి వాదాంశము. కాన, నట్టివానికి వ్యాఖ్యానముచేయుట ప్రాచీన గ్రాంథికాంధ్ర

భాషాసేవకుల కత్యంతోపకారకమును వ్యాఖ్యాకర్తకు ధన్యతాపాదకమును నై యుండు ననుటలో సందియములేదు.

ఇప్పటికి వెలయించిన యీ యాఱు ప్రకరణములలోను దద్భవ ప్రకరణ మును ననుస్వార ప్రకరణమును నక్షర ప్రకరణమును నంతస్థప్రకరణము లోని రేఫ అకారవిషయమును మిక్కిలిగ విపులీకరింపఁబడినవి.

ఆంధ్రభాషలో వైకృతశబ్దముల తెగయు మిక్కిలి విశాలమైనదియె. కాన, సంస్కృత శబ్దప్రపంచము వికృతినందిన పద్ధతులను నట్టి వికృతులు కల్గుటలోని శబ్ద తత్వశాస్త్రసిద్ధములగు నుపపత్తులను లఘువుగానైన దెలిసి కొనుట యత్యావశ్యకమై యున్నది. అందు వికృతులు కల్గు జాడలు మాత్ర మలంతిగ నర్వాచీనమగు కవిసంశయ విచ్ఛేదమున వివరింపఁబడి యున్నవి.

వర్ణోచ్చారణశుద్ధి, వర్ణవైశేష్యనిర్ణయము, వికృతిశబ్దావిర్భావములోని భాషా పరిణామోపపత్తిజ్ఞానము, మున్నుగందటి సంధిప్రభృతి వ్యాకరణ కార్యసాధన ప్రక్రియోపపత్తిజ్ఞానము, మున్నగు ననేక భాషాశాస్త్రవిషయ ముల కక్షర తత్వశాస్త్రము మూలభూతమైయున్నది. అట్టి విషయ మాంధ్ర వ్యాకరణాభ్యాసకులకేగాక లౌకిక సంస్కృత వ్యాకరణాభ్యాసకులకు సైతము విస్తరించి యుపదేశించు సంప్రదాయమె లేదు. అట్టి శాస్త్రము నుపపాదించు గ్రంథ మాంధ్రవాఙ్మయమున నిప్పటికిని వెలసియుండలేదు. వైదిక సంస్కృత వ్యాకరణములలో మాత్రమె యట్టి శాస్త్రము విస్తరిల్లియున్నది.

అనుస్వార చరిత్రమింకను వింతదశలో నున్నది. హ్రస్వముమీఁది యర్ధానుస్వారమునుండి పూర్ణానుస్వారమును జింతామణి సాధించుచున్న ట్లహోబలపతి వ్యాఖ్యచేసియుండెను. నన్నయ భట్టారకునకు ముందు సైత మర్ధానుస్వారము పూర్ణానుస్వారరూపముగనో యనునాసికరూపముగనో లిఖింపఁబడెడిదని కొందఱు విమర్శకులు వ్రాయుచున్నారు. అరసున్న కర్ధ చంద్రాకార లిపి నాధునిక ముద్రణకర్తలు కల్పించిరని కొందఱు తలంచు చున్నారు.

ఇంక రేఫ అకారవిషయకములగు నధర్వణకారికల యర్థమె దుర్జ్ఞేయమై యున్నది. వీనికి వింతవింతలగు విపరీతార్థములను గొందఱు పండితులు చేసియున్నారు.

పయి కారణములచేతఁ దత్తద్విషయములను గొంత విస్తృతమగు విమర్శనముతో వ్రాయవలసివచ్చెను. ఉచ్చారణ భ్రష్టములగు నర్ధానుస్వార శకట రేఫముల విషయమున నింతపరివిగ వ్రాయనేల యని యెంతమాత్రమును దలంపరాదు. ప్రాచీన గ్రాంథికాంధ్రభాషా విషయమున వాని పరిశోధన మత్యావశ్యకమనియు నేఁటికిని బ్రామాణిక గ్రాంథికాంధ్రభాషా లేఖన

ముద్రణాదులలో నయ్యవి పట్టుదలతోఁ బాటింపఁబడుచునే యున్నవనియుఁ పాఠకమహాశయులు గ్రహింతురుగాక.

పఴగన్నడము తమిఴము మున్నగు నన్యదేశ్య శబ్దములలో వెలయుచున్న ఴకారపు లిపి 'ழ' అనురీతిని దమిఴమునందును 'ఴ' అను రీతిని బ్రాచీనాంధ్రకర్ణాట సాధారణ లిపియందును నుండుటంజేసి, యట్టి శబ్దముల నుపయోగించునపుడా యాంధ్రకర్ణాట సాధారణలిపి యిం దుపయోగింపఁబడుచు వచ్చెను. నన్నయభట్టారకుని నాఁటి కట్టివర్ణము తెల్గున, డకారాది రూపముగఁ బరిణమించి యుండుటంజేసి, యది యిందలి యచ్చాంధ్రవర్ణసమామ్నాయమున గ్రహింపఁబడదయ్యెను.

ఆంధ్రశబ్దచింతామణి కీవఱకుఁ బుట్టియున్న వ్యాఖ్యలలో విపులమయియున్న సంస్కృతభాషామయమగు కవిశిరోభూషణమును రచించిన యాతని పేరు పురాణగాథలచొప్పున "అహోబిలుఁడు" అని చెప్పఁదగియున్నను నీవఱకున్న లిఖితముద్రిత గ్రంథములందెల్ల "అహోబలపండితుఁడు, అహోబల పండితీయము" అని యిట్లు వెలసియుండుటంజేసి సంజ్ఞావిషయమున నట్లు పేర్కొన్నను క్షతిలేదన్న తలంపునఁ నట్టిపేరులిందు మార్పలేదు. (చూడుఁడు- ఆంధ్రవిజ్ఞాన సర్వస్వము, అహోబలశబ్దము.) మఱియు నహోబల శబ్దభవమగు తద్భవరూపము "ఓబల, ఔబల, ఓబ, ఓబమ్మ" అను రీతినె గ్రంథములలో వెలయుచుండుటంజేసి ప్రాచీన పండిత వ్యవహారమునందును 'అహోబల' అను వ్యవహారమె యుండెడిదని విశదమగుచున్నది. "ఓబాంబికాయాం నరసక్షితీంద్రాత్" (సదాశివదేవరాయల దానశాసనము ఎపిగ్రాఫియా ఇండికా, ౪ పుస్తకము, ౧ పుట.)

నేను శ్రీ విజయనగర మహారాజులవారి సంస్కృతకళాశాలయందాంధ్ర ప్రధానోపాధ్యాయుఁడుగ నున్నపుడె నన్నయాథర్వణ గ్రంథములను జోడించి యద్దాని వ్యాఖ్య రచనమునకుఁ దగు సామగ్రిని సమకూర్చుకొనుచుండెడివాఁడను. అట్లాంధ్రభాషా వాఙ్మయ పరిశోధనముచేయు సందర్భమున నావఱకు రచించియున్న వసుచరిత్రవిమర్శన హరిశ్చంద్రనలోపాఖ్యాన విమర్శనములకుఁ దోడుగ నథర్వణకారికావళీ విమర్శనమును సంతరించి, బాలసరస్వతీయ విమర్శన చింతామణివిషయ పరిశోధనముల రచనమునకుఁ గడంగితిని. ఇంతలో నేను చెన్నపురి విశ్వవిద్యాలయాంధ్రభాషా వాఙ్మయ పరిశోధకసభ్యుఁడుగ నియమింపఁబడుటచేత దీర్ఘపరిశోధనము చేయుచు, నట్టి గ్రంథముల రచనమును గొనసాగించుట కవకాశము కల్గెను. కాఁగా, నచట నున్న మూఁడేండ్లలో నా రచింపఁబూనియున్న నన్నయాథర్వణీయ వ్యాఖ్యానమగు వైయాకరణ పారిజాతమనెడి గ్రంథమునందలి యీ మొదటిభాగ

మూఁడు ప్రకరణములను రచించితిని. నేను దీనిని ముద్రింపించుకొని దీని స్వామ్యము ననుభవించుట కుదారహృదయులగు శ్రీ మద్రాసు విశ్వవిద్యాలయమువా రనుగ్రహించిరి. పిదప నేను శ్రీ యాంధ్రవిశ్వకళాపరిషత్కళాశాలయం దాంధ్రోపాధ్యాయుఁడుగ నియమింపఁబడి యపు డాంధ్రవిశ్వకళాపరిష దుపాధ్యక్షులయియున్న శ్రీ ప్రొఫెసర్, సర్, సర్వేపల్లి రాధాకృష్ణ పండిత, క్నై. టి; యమ్. ఎ; డీ. లిట్; వారితోనే తద్గ్రంథవిషయమును బ్రసంగించి ముద్రణరూపమున దీని వెలయింపవేఁడఁగా నమ్మహాశయు లాంధ్రవిశ్వకళాపరిషత్తువారి ప్రచురణములలో నొకటిగా నా యీ గ్రంథముండునట్లేర్పాటుచేయ, శ్రీ సిండికేటువా రద్దాని నామోదించి నా భాషాసేవకుఁ బ్రోత్సాహ మొసంగిరి. తరువాత, నాంధ్రవిశ్వకళాపరిష దుపాధ్యక్షపదవి నధిరోహించిన పండిత విమర్శకాగ్రసరులగు శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి యమ్. ఎ; (Cantab) యమ్, ఎల్. సి; వా రట్లారంభింపఁబడిన యేతద్గ్రంథముద్రణమును బూర్ణముగావింపించి, దీనిని వెలయింపఁజేసిరి. పైరీతి నేతద్గ్రంథవ్యాప్తికి మూలభూతులగు ప్రభుమహాశయులందఱియెడలను, నే నత్యంత కృతజ్ఞుఁడ నగుచున్నాను.

ఈ గ్రంథమందలి తమిళ మలయాళభాషావిషయముల పరిశీలనమునకు వలయు తత్తద్వ్యాకరణాది గ్రంథసారములను నాకుఁదెలిపిన తమిళాంధ్రకర్ణాటమలయాళ భాషావిశారదులగు విద్వాన్, వి. వేంకటరాజులురెడ్డిగారియెడలను (మద్రాసు విశ్వవిద్యాలయమువారి తమిళ భాషావాఙ్మయ పరిశోధకసభ్యులు) కర్ణాటభాషావ్యాకరణాది విషయములను దెలిపినసంస్కృత కర్ణాట భాషా పాండిత్య పరిపూర్ణులగు శ్రీమాన్, హెచ్, శేషయ్యంగారు, ఆచార్యులుగారి యెడలను (మద్రాసు విశ్వ విద్యాలయమువారి కర్ణాట భాషా వాఙ్మయ పరిశోధక సభ్యులు) నే నత్యంత కృతజ్ఞుఁడ నగుచున్నాను.

పాఠక మహాశయులు సావధానముగ నా యీగ్రంథమును జిత్తగించి యిందలి గుణలేశములను మన్నించి స్వభావ సులభమగు సమ్మోదము నందుదురు గాక.

అచిరకాలములో నేతద్గ్రంథశేషమును వెలయించు నుత్కంఠతో నున్నవాఁడను, శ్రీమదాంధ్ర వాగ్దేవతా కటాక్షమునఁ గొలఁది కాలములో గ్రంథపూర్తిని గావించి కృతార్థత నందుదునని విశ్వసించుచున్నాను.

విశాఖపట్టనము
5-11-1936.

ఇట్లు గ్రంథకర్త:
వఝ్ఝల చినసీతారామస్వామి శాస్త్రి.

# విషయసూచిక.

## గ్రంథాదిసందర్భము. I



విషయ సంఖ్య.


౧. గురుదేవతా ప్రశంస.

౨. గ్రంథాది సందర్భము.

౩. (నన్నయనాంటియాంధ్రభాషాస్థితి) గ్రంథాదిసందర్భము.

౪. మణిప్రవాళ రచనము, తద్విమర్శనము.

౫. విశ్వేత్యాది సూత్రవ్యాఖ్య, మంగళాచరణము.

౬. మంగళార్థక శబ్ద విమర్శనము.

౭. వ్యాకరణాదిని వర్ణగణాది శుద్ధిని పాటింప నక్కఱలేదు.

౮. విశ్వేత్యాది సూత్రమునకు సరస్వత్యాదులు చేసిన వ్యాఖ్యల విమర్శనము.

౯. వ్యాకరణ రచనము సైతము పురుషార్థసాధనమే.

౧౦. వ్యాకరణము కావ్యభాషామాత్రోపయోగి.

౧౧. చింతామణిలోని శ్లోకములు గీతి ప్రచురములు.

౧౨. తదదోషావిత్యాది సూత్రవ్యాఖ్య. అగ్రామ్యమై కావ్యముండవలెను.

౧౩. పై సూత్రమునకు సరస్వత్యాదులు చేసిన వ్యాఖ్యలు. తద్విమర్శనము.

౧౪. సావాగిత్యాది సూత్ర వ్యాఖ్య.

౧౫. సాధ్వ్యోహీత్యాది సూత్రవ్యాఖ్య; కావ్యరచనాసామగ్రి.

౧౬. కావ్యరచనమునకు వ్యాకరణజ్ఞాన మత్యావశ్యకము; సప్తవిధకవులు.

౧౭. స్వస్థానేత్యాది సూత్రవ్యాఖ్య.

౧౮. దీనికి బాలసరస్వత్యాదులుచేసిన వ్యాఖ్యలు, తద్విమర్శనము.

౧౯. స్త్రీ శూద్రుల సంస్కృతగ్రంథపఠన యోగ్యత.

౨౦. భాషల హేయత విషయమున తమిళ్రము సంస్కృతానుసారి కాదనెడి విషయమున నహోబలపతి యాశయము. తద్విమర్శనము.

౨౧. సిద్ధిశ్లోకాదిత్యాది సూత్రవ్యాఖ్య; సంస్కార శబ్దార్థము; చింతామణి వాఙ్మయ మూలకము కాదు.

౨౨. పాణినీయము వాఙ్మయస్థ భాషానుశాసనము కాదు.

౨౩. వ్యాకరణముకన్న మహాకవి ప్రయోగములే ప్రామాణికములు.

౨౪. నన్నయాథర్వణులు కవిప్రయోగములకే ప్రామాణ్యము నంగీకరించిరి.

విషయ సంఖ్య.

౨౫. శాస్త్రి ప్రయోగేత్యాద్యథర్వణసూత్రము సంస్కృత శబ్దవిషయకము.
౨౬. ఆంధ్రవ్యాకరణ ప్రయోజనములు.
౨౭. తాళపత్రమాతృకల యప్రామాణ్యము. అర్వాచీనులు నన్నయాథర్వణులవలెఁ గాక కావ్యేతర వాఙ్మయము సైతము సలక్షణము కావలెనని తలంచిరి.
౨౮. ప్రాచీన కావ్యవాఙ్మయమును సలక్షణముగ నుండునట్లు సవరించుట; నేఁటి వ్యావహారికాంధ్రమును నవీనగ్రాంథికభాషగ నంగీకరించుట.
౨౯. ఆంధ్రభాషా కవిత్వము లనాదులనెడు సరస్వత్యాదుల యాశయముల విమర్శనము.
౩౦. మహాకావ్యముల దోషములను జూపుట వ్యాకరణ ప్రయోజన మనెడి సరస్వత్యాదుల మతము సరికాదు.
౩౧. అథర్వణుఁడును మహాకవి ప్రయోగముల కనింద్యగ్రామ్యతను గల్పింపలేదు.
౩౨. వైయాకరణోక్తగ్రామ్యత వేఱు. ఆలంకారికోక్త గ్రామ్యత వేఱు. గ్రామ్యాశ్లీలాపశబ్ద దోషములు.
౩౩. దేశ్యములకు మాత్రము లోకవ్యవహారము మూల మనుట సరికాదు.
౩౪. సన్మూలవత్త్వా దిత్యాది సూత్రవ్యాఖ్య.
౩౫. సంకోచవికాసన్యాయ కల్పిత వ్యాకరణ సూత్రములను మహాకవు లుల్లంఘించుట సరియె. సామాన్యులకు వ్యాకరణమె యాధారము.
౩౬. సన్మూలేత్యాది కహోబలపతిచేసిన వ్యాఖ్య, తద్విమర్శనము. అపశబ్దతాలక్షణము.
౩౭. శ్రుతేపశబ్దే చేత్యాది సూత్రవ్యాఖ్య.
౩౮. ఆద్య ప్రకృతిః ప్రకృతిశ్చేత్యాది సూత్రవ్యాఖ్య.
౩౯. అందలి కేవలతయేత్యాదికి సరస్వత్యాదుల వ్యాఖ్య. తద్విమర్శము.
౪౦. ప్రాకృత వికృతిశబ్దముల యర్థములు.
౪౧. ప్రాకృతాంధ్రములకుఁగల వైజాత్యము.
౪౨. పైశాచ్యపభ్రంశములకుఁ దొలుతఁ బ్రాకృతత్వ వ్యవహారము లేదు.
౪౩. ఆద్యామహాష్ట్రేత్యాది సూత్రవ్యాఖ్య.
౪౪. ఆంధ్రమునకుఁ బ్రాకృత ప్రకృతికత్వమును జెప్పనక్కఱలేదు.
౪౫. శాస్త్రి మపౌరుష మిత్యాది సూత్రవ్యాఖ్య.
౪౬. ప్రాకృత వ్యాకరణమును జదువుకొనవలె ననకుండుట లోటుకాదు.
౪౭. సరస్వత్యాదులు శాస్త్రిమిత్యాది సూత్రమును విడుచుటలోని కారణము.

II తద్భవప్రకరణము.

౪౮. వర్ణలోపాగమా ఇత్యాది సూత్రవ్యాఖ్య.
౪౯. ఇందలి యపపాఠములు.
౫౦. ప్రాకృతభవములను సంస్కృతమునుండియు సాధింపనగు ననియథర్వణాశయము.

విషయ సంఖ్య.

౫౧. అప్పకవిచూపిన కొన్ని తద్భవముల ప్రక్రియలో నహోబలపతి చూపిన దోషములు.

౫౨. తద్భవములకుఁ బ్రాకృతప్రకృతులను జూపినవా రెవరు ?

౫౩. మొ కవిజనాంజన టీక చాలవఱకు బాలసరస్వతీయమె యనఁబడును. ఈ టీకలోఁ

౬౧. వ జేర్చిన తద్భవప్రక్రియ కవిసంశయ విచ్ఛేదమూలకమె.

౬౨. ఆంధ్రభాషాభూషణ కవిసంశయ విచ్ఛేదాదులు సంస్కృతమునుండియే తెనుఁగులోని తద్భవములను సాధించుచున్నవి.

౬౩. తెనుఁగులోని కీ తద్భవము లెట్లువచ్చె నను విషయమున నెత్తిన సారాంశత్రయము. తత్సిద్ధాంత విమర్శనము.

౬౪. మొదటి సారాంశము. సంస్కృతము వ్యవహారభాషయై యుండఁగాఁ దెల్గు తద్భవము లేర్పడెననఁ జనదు.

౬౫. రెండవసారాంశము—ప్రాకృతమె వ్యవహారవశమునఁ దెల్గుగఁ బరిణమించె ననరాదు.

౬౬. మూఁడవ సారాంశము—సంస్కృతపండితులు తెల్గు విభక్తులతో సంస్కృతశబ్దములను దెనుఁగులో వాడుచుండఁగాఁ దెల్గువారును వానిని వాడుటలో నీతద్భవము లేర్పడియుండవచ్చును. దేశ్యము స్వతంత్రము.

౬౭. తద్భవప్రక్రియకు సూరకవి హేతు ప్రదర్శనము చేయలేదు.

౬౮. తద్భవములు పుట్టుటకుఁ గారణములు. తద్భవత్వ నిర్వచనము, ఎట్టి వికృతులు గలవి తద్భవము లనిపించుకొనును ?

౬౯. అజ్వికృతి—I, II అకారవికృతి. III ఇకారవికృతి. IV ఉకారవికృతి. V ఋకారవికృతి. VI ఏకారవికృతి. VII ఐకారవికృతి. VIII ఓకారవికృతి. IX ఔకారవికృతి. X ఐ, ఔలు 'అయి, అవు' లగుట. XI ద్విత్వపూర్వదీర్ఘస్వరహ్రస్వము. XII ఏకాధిక గుర్వక్షరములలో నొకదీర్ఘము హ్రస్వమగుట. XIII ద్విత్వహ్రస్వములు.

౭౦. తద్భవములందలి స్త్రీ ప్రత్యయములు—స్త్రీ సమములు:—I చీరయున్నగులుప్త మువర్ణకములు. II కనవు మున్నగు వువర్ణాంతములు. III. తేజము న్నగు 'ఉ' వర్ణాంతములు.

౭౧. పదాది స్వరాగమములు.

౭౨. రేఫ పరక స్వరలోపము.

౭౩. అనునాసి కోపరిస్థ స్వరలోపము.

౭౪. స్వరశక్తి.

హల్వికృతి:—

౭౫. తద్భవాదులలోని వర్ణలోపమునకు బీజములు.

విషయ సంఖ్య.


౮౬. వర్ణలోపమునఁ బూర్వాక్షరమునకు దీర్ఘము వచ్చుట.

౮౭. హకారలోపము—అట్టియెడఁ బూర్వస్వరమున్నచో దానికి దీర్ఘము వచ్చుట.

౮౮. పదాదిని హకారేతర హల్ వర్ణలోపము.

౮౯. ద్విత్వమునకు మాఱుగాఁ బూర్వస్వరమునకు దీర్ఘము నిల్చుట.

౯౦. అనుస్వారలోపము - అది యరసున్న యగుట.

౯౧. క చ త ర వ హలు లోపింప వానిమీఁది స్వరము నిల్చుట. అచటి సంహితలో యవలు నిల్చుట. 'ఇ + అ = ఎ' అను మార్పు కల్గుట. 'ఇయ' అనునది 'ఎ' అగునుగాని 'ఎ' అనునది 'ఇయ' కానేరదు.

౯౨. సంయుక్తవర్ణ పరిణామము. విజాతీయ హల్లుల సంయోగము సజాతీయ హల్సంయోగముగ మాఱుట.

౯౩. ద్విత్వేత్యాది కారికావ్యాఖ్య. లుప్తశేషవ్యంజన ద్విరుక్తరూపములో నొకహల్లు క్వాచిత్కముగ లోపించుట.

౯౪. నకారపూర్వక మకారమును బిందుపూర్వక బకారమును ద్విరుక్త మకార రూపమునందుట.

౯౫. దీర్ఘపూర్వకత్వమున లుప్తశేష వ్యంజనమునకు ద్విత్వము రాదు.

౯౬. హ్రస్వపూర్వకమునందును లుప్తశేషవ్యంజనము ద్విత్వరహితరూపముతో నుండుట యరుదుగఁగలదు.

౯౭. 'బొట్లు' ఇత్యాది సూత్రవ్యాఖ్య; శబ్దసరళకై బింద్వాగమము వచ్చుటయుఁ గలదు. ద్విత్వమునకు మాఱుగ బిందుపూర్వక వ్యంజనము నిల్చుటయుఁ గలదు.

౯౮. సంయుక్త వ్యంజనముల లోపము గల్గునపుడు లుప్తవ్యంజనానుకూల స్వరపరిణామమును గల్గును.

౯౯. సంయుక్త వ్యంజన బహుత్వమున వ్యంజనలోప వికృతుల వైవిధ్యము.

౧౦౦. అంతస్థోష్మములతోఁ దద్భిన్నములకు సంయోగ మున్నపుడు గల్గెడి పరిణతి పద్ధతులు.

౧౦౧. అంతస్థోష్మముల పరస్పర సంయోగమునందలి పరిణతి పద్ధతులు.

౧౦౨. వర్గాక్షరసంయోగ పరిణతి పద్ధతులు.

౧౦౩. వికర్షవికృతి = భిన్నతా వికృతి.

౧౦౪. వికర్షవికృతిలోని స్వరాగమ పద్ధతులు.

౧౦౫. వికర్షపరిణామ బీజము.

౧౦౯. వ్యత్యయ వికృతి. ప్రాకృతమున నిది యరుదు.

౧౧౦. వర్ణాదేశవికృతి. మహాప్రాణములలోని మహాప్రాణాంశము లోపించుట.

౧౧౧. వర్గీయవర్ణముల పరిణామము.

విషయ సంఖ్య.

౧౧౨. వర్గచతుర్థములు వర్గతృతీయములుగఁ బరిణమించును.

౧౧౩. పరుషసరళములకుఁ బరస్పర పరిణతి గల్గును.

౧౧౪. వర్గయుక్కులు హకారరూపము నందుట. అనఁగా నందలి వర్గీయాంశము లోపించుట.

౧౧౫. తచేత్యాదిసూత్రవ్యాఖ్య:—తచవర్గముల పరస్పర పరిణామము.

౧౧౬. కలుగు బంధుతేత్యాది సూత్రవ్యాఖ్య—టత వర్గ పరస్పర పరిణామపద్ధతి—సంస్కృతమునందలి ట వర్గస్థితి ప్రాచీనత.

౧౧౭. వర్గాక్షరపరక సంయోగములో ననునాసికములు నియతముగ బిందువు లగును. అట్టి పరిణతి కల్గినను నా శబ్దములు తద్భవములు కావు.

౧౧౮. అథర్వణుఁ డనుకృతిలో సంస్కృతశబ్దాంత మకారము సైతము బిందువుగనె యుండునని సూచించెను. ఇది ప్రాకృతపద్ధతి.

౧౧౯. వరునేత్యాది సూత్రవ్యాఖ్య. రల, చస, టడ, వప, నణ, కగ, మవ, వబ, శ ష చస ల పరస్పర పరిణామములు.

౧౨౦. చజల దంత్యతా పరిణామము. తాలవ్యతా పరిణతిలోని స్వరపరిణామము.

౧౨౧. యతిసంబంధములవంటి పరిణామములును గల్గును. లళనణలకు డకారాదేశము.

౧౨౨. ఞణల లకు నకారాదేశము.

౧౨౩. యజ ల పరస్పర పరిణామము.

౧౨౪. శషచలు సకారమగుట. అట్టి సకారము దంత్య చకారముగ మాఱుటయుఁగలదు.

౧౨౫. శ వర్ణమును దాలవ్యస్వరయుత సకారమును దాలవ్య చకారముగాఁ బరిణమించుటయుఁ గలదు.

౧౨౬. హకారము గకార మగును. అది కకారముగ మాఱుటయుఁ గలదు.

౧౨౭. రేఫము అకారముగ మాఱుటయుఁ గలదు.

౧౨౮. 'ఇరి-ఉవ-ఉడి-ఏరి' ఆగమములు వచ్చుట.

౧౨౯. అగ్రాహ్యములగు కవిసంశయ విచ్ఛేదములోని కొన్ని తద్భవసూత్రములు—రేఫమునకు డత్వమగుట.

౧౩౦. బిందుపూర్వక జ బ లకు గకారాదేశము. (అనుభవవిరుద్ధము).

౧౩౧. ఊష్మాంతస్థ పరస్పర పరిణామము (అగ్రాహ్యము).

౧౩౨. పదాదినున్న యచ్చులకు వకారాగమము. (అగ్రాహ్యము).

౧౩౩. తాకు యకారాదేశము (అగ్రాహ్యము).

౧౩౪. అనునాసికముల పరస్పర పరిణతి (అగ్రాహ్యము).

౧౩౫. క్రార యాగమమగుట. (అగ్రాహ్యము).

౧౩౬. కవిసంశయ విచ్ఛేదములోని కొన్ని పునరుక్తవైకృతవిధులు.

౧౩౭. తుకు జ స లు కకారము నిల్చుట (గతార్థము).

విషయ సంఖ్య.


౧౩౮. ద ధ ట ఢ లకు డకారాదేశ మగుట. వకారమునకు 'పా' దేశము (గతార్థము).

౧౩౯. ఖాకు గాదేశము (గతార్థము).

౧౪౦. తద్భవప్రకరణోపసంహారము.


## అక్షరప్రకరణము.


౧౪౧. అక్షర ప్రకరణారంభము. అను ప్రదానాదిత్యాది కారికావ్యాఖ్య. పృథగ్వర్ణతాంగీకార బీజములు. ధ్వన్యాత్మక వర్ణోత్పత్తి ప్రక్రియ.

౧౪౨. ధ్వన్యాత్మక వర్ణోత్పత్తి ప్రక్రియవిషయమునందలి పాణినీయశిక్షా కారికలు. ఉదాత్తానుదాత్త స్వరితత్వముల ప్రకారము.

౧౪౩. ఉదాత్తాదులు వర్ణపై శేష్య సంపాదకములు కావు.

౧౪౪. హ్రస్వ దీర్ఘ ప్లుత వ్యంజ నోచ్చారణకాల (మాత్రా) వివరణము. ఏకమాత్ర ఇత్యాది కారికావాఖ్య.

౧౪౫. మాత్రా కాలవివరణము. చాషాది పక్షిరుతముల కాలపరిమితి. మాత్రా కాలమును బట్టి చేసెడి లఘుత్వ గురుత్వ వివివరణము. సంయుక్తాక్షర కాలపరిమితి.

౧౪౬. ఋ ఌవర్ణము లేకైకమాత్రాకాలికములె, రలసంపృక్త ఋ ఌవర్ణములందుఁ గల యణురూప భాగముల వివరణము. స్వరభక్తి. హల్ సంపృక్తియు.

౧౪౭. అనుస్వారము మాత్రాకాలికము. ఈ విషయమునందలి యభిప్రాయభేదములు. అనుస్వార పరక స్వర కాల విశేషములు.

౧౪౮. అనుస్వారము మాత్రాకాలికమె యైనను నది వ్యంజనమె. ఈ విషయమునఁ గల యభిప్రాయభేదములు. అనుస్వార ముభయమా? అనుభయమా?

౧౪౯. ఖయాం యమా ఇత్యాది కారికావ్యాఖ్య. వర్ణముల శ్వాస నాదాది సంజ్ఞల వివరణము. ఇవి బాహ్యప్రయత్నములు.

౧౫౦. శ్వాసాఘోష వర్ణోచ్చారణప్రకారము. అందు నాదము కలుగమికిఁగల కారణములు. వివార మను బాహ్యప్రయత్నము.

౧౫౧. నాదఘోష వర్ణోచ్చారణప్రకారము. అందు నాదఘోషములు గల్గుటలోని కారణములు. సంవార మను బాహ్యప్రయత్నము.

౧౫౨. పై విషయముల వివరించుటలోని యాంధ్రవిజ్ఞాన సర్వస్వప్రమాదము.

౧౫౩. మహాప్రాణ వర్ణోచ్చారణప్రకారము. అందుఁ గల్గు సోష్మత. అల్పప్రాణవర్ణముల వివరణము.

౧౫౪. హకార వర్గచతుర్థముల యుచ్చారణములోని విశేషము. వాని హకారసంజ్ఞ. శ ష స లును ననుస్వార విసర్గములును, నల్పప్రాణములె యను తైత్తిరీయ ప్రాతిశాఖ్యాశయము.

౧౫౫. ఈషచ్ఛ్వాసములు. ఈషన్నాదములు.

౧౫౬. పాశ్చాత్యపండితులు చెప్పెడి ధ్వన్యాత్మక వర్ణోత్పత్తి పద్ధతులు.

విషయ సంఖ్య.


౧౫౭. మూర్ధాభిఘాతము లేదను మతము సరికాదు. పేటికాకారవర్ణనము. ఏతద్విషయమునందలి మూర్ధశబ్దము నర్థము.

౧౫౮. కంఠ్యావహా విత్యాది కారికావ్యాఖ్య. వర్ణములకంఠ్య తాలవ్య తాదుల వివరణము.

౧౫౯. అభ్యంతర ప్రయత్నమన నెట్టిది?

౧౬౦. వక్త్రిస్వరూప వివరణము. జిహ్వామూలాది వక్త్రి భాగములు. వర్త్స్యము. బర్స్వ్యము. తాలువనఁగా దౌడకాదు.

౧౬౧. కంఠమె జిహ్వామూలము కాదు.

౧౬౨. స్థాన కరణముల లక్షణము. స్వరముల స్థాన కరణముల వివరణము.

౧౬౩. హల్లుల విషయమున స్థానకరణముల లక్షణము.

౧౬౪. నిశ్వాసము స్థానకరణ సంయోగమును విడఁగొట్టుననుట ప్రాచ్య పండితులకును సమ్మతమె.

౧౬౫. అభ్యంతర ప్రయత్న చాతుర్విధ్యము.

౧౬౬. వివృత సంవృత స్పృష్ట స్పర్శాది సంజ్ఞలు, ఆయా సంజ్ఞల సార్థక్యము.

౧౬౭. 'ఈషత్స్పృష్టములు. అంతస్థములు.' అను సంజ్ఞల సార్థక్యము. ఏతన్నిరుక్తి విషయమునఁ గల యభిప్రాయ భేదములు.

౧౬౮. 'ఊష్మములు, విసర్గము, విసర్జనీయము, జిహ్వామూలీయము, ఉపధ్మానీయము,' అను సంజ్ఞలు; వాని నిరుక్తియు.

౧౬౯. 'అనుస్వారము, వర్ణము, స్వరము, వ్యంజనము,' అను సంజ్ఞల సార్థక్యము.

౧౭౦. కంఠ్యములు—

౧౭౧. అవర్ణము కంఠ్యమని ప్రాతిశాఖ్య మేదియుఁ జెప్పలేదనెడి విట్నీ దొరగారి యభిప్రాయము సరికాదు. అవర్ణమునందలి యాభ్యంతర ప్రయత్నము.

౧౭౨. అవర్ణమునకు హనువులు స్థానమని చెప్పఁబడినను నది కంఠ్యమనుటలో విరోధము లేదు.

౧౭౩. హకార విసర్గములును గంఠ్యములె. ఇవి ఉరస్యములని కొందఱందురు.

౧౭౪. అయోగవాహము లాశ్రయస్థానభాగు లను విషయపు విమర్శనము.

౧౭౫. అవసానగత విసర్గమున కాశ్రయస్థాన భాగిత్వ మనుభవసిద్ధము.

౧౭౬. జిహ్వామూలీయములు. కవర్గము కంఠ్యముకాదు. ఇంక నది జిహ్వామూలీయము.

౧౭౭. ఋ ౡవర్ణముల స్థానమును జెప్పుటలోని మతభేదములు. అవి పరస్పరవిరుద్ధములు కావు.

౧౭౮. కవర్గమునకు జిహ్వామూలమె స్థానమనియు హనుమూలమె కరణమనియు శుక్లయజుః ప్రాతిశాఖ్యాదులు చెప్పుచున్నవి.

విషయ సంఖ్య.


౧౪౯. తాలవ్యములు. యకారోచ్చారణమున జిహ్వాంతము తాలువును దాఁకు ననెడి యాధునిక మతము సరికాదు.

౧౫౦. ఓష్ఠ్యములు—వీనికి మీఁదిపెదవి స్థానము; క్రిందిపెదవి కరణము.

౧౫౧. ఓష్ఠ్యముల స్థాన కరణైక్యము శుక్లయజుః ప్రాతిశాఖ్యమునఁ జెప్పఁబడినది.

౧౫౨. మూర్ధన్యములు.—

౧౫౩. రేఫ ఋ వర్ణములు మూర్ధన్యము లనుట సరికాదు.

౧౫౪. బర్శ్వ్యము కాదు, బర్స్వ్యము; అది రేఫమునకు స్థాన మను నాధునికోక్తి సరికాదు.

౧౫౫. శాస్త్రీయములగు స్థానకరణముల నించుక తప్పించియు నాయాయి వర్ణములను బలికింప వచ్చును; కాని యట్టి యుచ్చారణములు దుష్టము లనిపించు కొనును.

౧౫౬. రేఫోచ్చారణమున జిహ్వాగ్రమునఁ గంపము కల్గుననెడి పాశ్చాత్యాశయము సరికాదు—అట్టి కంపము ఱకారోచ్చారణమునఁ గల్గును.

౧౫౭. అంతస్థముల లఘ్వలఘుతలు. అలఘు లకారోచ్చారణము చిరకాలము క్రిందటి నుండియు సంస్కృతమునఁ గలదు. లఘ్వలఘువులు వేర్వేఱు వర్ణములు కావు.

౧౫౮. దుఃస్పృష్ట డ కార ఢ కారములు.

౧౫౯. ఈ దుఃస్పృష్ట డకారము ఋగ్వేదమునందలి సంస్కృత శబ్దములలోను నగపడుచున్నది. ద్రావిడ భాషలలో సైత మిది డకార మూలకమును ళకారముగఁ బరిణమించునదియునై యున్నది. డకారముగఁ బరిణమించుటయు గలదు.

౧౬౦. సంస్కృతమునందు సైత మీ దుస్స్పృష్ట డకారమును ళకారముగఁ బలుక సాగిరి.

౧౬౧. అప్పకవియు నీ సంస్కృత ళకారమును ళకారముగ భావించెను. ఆధునిక పండితులును నట్లె తలంచుచున్నారు. ఇది సరికాదు.

౧౬౨. "రలయోః" రిత్యాద్యభేద ప్రతిపాదక కారిక స్థానైక్యబోధకము కాదు. అది శ్లేషాదులకయి చెప్పఁబడినది.

౧౬౩. మూర్ధన్య ళకారము ద్రావిడ భాషలలోఁ గలదు.

౧౬౪. ఇట్టి ద్రావిడళకార సంపర్కముననే యలఘు లకార దుఃస్పృష్ట డకారము లుచ్చారణమునందును లేఖనమునందును ద్రావిడ ళకార సామ్యము నందుచున్నవి.

౧౬౫. దంత్యములు—

౧౬౬. ళకార లకారస్థాన విషయమునందలి యభిప్రాయ భేదములు.

౧౬౭. లకార మీషత్ స్పృష్టము కాదనియు స్పృష్టప్రయత్నవంతమె యనియుఁ బాశ్చాత్య పండితులు చెప్పుట సరికాదు.

విషయ సంఖ్య.


౧౯౮. చజలు తాలవ్యములును, దంత్యములును.

౧౯౯. వకారము దంతోష్ఠ్యము.

౨౦౦. సంధ్యచ్చులు.

౨౦౧. ఏఓలు సంధ్యచ్చులు కావను పాశ్చాత్య పండితుల యాశయము.

౨౦౨. శుక్లయజుః ప్రాతిశాఖ్యమును నట్లె చెప్పుచున్నది.

౨౦౩. ఉవ్వటుఁడు దానికి వేఱు విధమునఁ జేసిన వాఖ్య సరికాదు.

౨౦౪. శుక్లయజుః ప్రాతిశాఖ్యాశయమును సరికాదు. ఏఓలు సంధ్యచ్చులనుటయె యుక్తము.

౨౦౫. ఏకారోచ్చారణమున 'అఇ' అనువాని జాడలు గలవు.

౨౦౬. ఓకారోచ్చారణమున 'అఉ' అనువాని జాడలు లగపడుచున్నవి.

౨౦౭. ఐఔలు సంధ్యచ్చు లనుట సర్వ సమ్మతము. ఏఓలలో సంధించిన యచ్చులు తుల్యాంశకము లగుటచేతఁ బ్రశ్లిష్టావయవములైనవి; ఐఔలలో సంధించిన యచ్చులు న్యూనాధికాంశకము లగుటచేత విశ్లిష్టావయవము లగుచున్నవి.

౨౦౮. శుక్లయజుః ప్రాతిఖ్య మూల సూత్రము పై పద్ధతి కనుకూలముగనే యున్నను వ్యాఖ్యాత పొరపడి వేఱుమార్గముఁ ద్రొక్కెను.

౨౦౯. అట్టి వ్యాఖ్య మూలాభిప్రేతము కాదు.

౨౧౦. "ఎ ఒ" అను హ్రస్వరూపములు సంస్కృతమునందును గలవు.

౨౧౧. 'అనుస్వారము. యమములు. నాసిక్యము' అనువాని స్థానకరణములు.

౨౧౨. స్వరమె అక్షరము. అనుస్వారవ్యంజనాదు లంగములు. అంగాంగిభావనిష్కర్షము.

౨౧౩. సానునాసిక స్వరములకుఁ బృథగ్గణనము లేదు. అర్ధానుస్వారమునకు వర్ణపార్థక్యమంగీకర్తవ్యము.

౨౧౪. యవలకును నానునాసిక్యము కలదు. వాల్లుల యానునాసిక్యము తత్పూర్వ స్వర సానునాసికత్వరూపమై యుండును.

౨౧౫. పృథగక్షరత్వాంగీకార లక్షణములు.

౨౧౬. ఆద్యాయా ఇత్యాది సూత్ర వ్యాఖ్య.

౨౧౭. ద్విధాక ఇత్యాది కారికావ్యాఖ్య.

౨౧౮. సంస్కృతవర్ణ సమామ్నాయమున ళకారము నుపేక్షించి ఌకారమును నిల్పుట వక్తృభిప్రేతము.

౨౧౯. మాహేశ్వర సూత్రములలో ఌకారము పేర్కొనఁబడనంతమాత్రమున నది సంస్కృతాక్షరము కాదనరాదు.

౨౨౦. కర్ణాటక శబ్దానుశాసనకర్త భట్టాకలంకుఁడు మాహేశ్వరసూత్రముల విషయమునఁ జేసిన విమర్శనము.

౨౨౧. మాహేశ్వర సూత్రములు; ప్రత్యాహారములు.

విషయ సంఖ్య.

౨౨౨. మాహేశ్వర సూత్రములలోని వర్ణముల వరుస సరియగు నది కాదు. లోకప్రసిద్ధ మగు వరుస శుక్లయజుః ప్రాతిశాఖ్యమునఁ గలదు. అందే సంస్కృతవర్ణ సమామ్నాయమును గలదు.
౨౨౩. అనుస్వారవిసర్గములు స్వరములా? వ్యంజనములా?
౨౨౪. ఋగ్వేద ప్రాతిశాఖ్యములోని వర్ణ పారాయణక్రమము.
౨౨౫. పాణినీయ శిక్షలోని సంస్కృత వర్ణసమామ్నాయము.
౨౨౬. పాణినీయశిక్షలోని దుఃస్పృష్టశబ్దము లకారద్వయయుత ఌకారపరమనెడి వాచస్పత్యమతము సరికాదు.
౨౨౭. తైత్తిరీయ ప్రాతిశాఖ్యమునందలి వర్ణసమామ్నాయము.
౨౨౮. ఇందు ఌకారము స్పష్టముగాఁ బరిగణింపఁబడెను.
౨౨౯. 'స్వరములకన్నిటికిని హ్రస్వదీర్ఘప్లుతత్వములు గలవు' మున్నగు వర్ణ సమామ్నాయ సంఖ్యావిషయక మతభేదములు.
౨౩౦. చింతామణికర్త తలంచిన పంచాశద్వర్ణము లెవ్వి? యమములను ఌతేయును నన్నయభట్టు పరిగణింపలేదు.
౨౩౧. ప్లుతమును గురువె. దీనికి మాత్రాత్రయ గణనము కవి ప్రయోగములో లేదు.
౨౩౨. అప్పకవ్యాదులు ప్లుతము త్రిమాత్రాకమని చెప్పుట యవిమృశ్యకృతము.
౨౩౩. నన్నయభట్టు ప్లుతమును దీర్ఘముగ మాత్రమె భావించెను.
౨౩౪. ఇతఁడు దూరాహ్వానమునందును హ్రస్వ సంబోధనమును జేసియున్నాఁడు.
౨౩౫. జిహ్వామూలీయోపధ్మానీయములను బంచాశద్వర్ణములలో నన్నయ పరిగణింప లేదు.
౨౩౬. అహోబల పత్యాదుల మతమును నిదియె.
౨౩౭. ఌకార దీర్ఘము పాణిని శిక్షలోను దైత్తిరీయ ప్రాతిశాఖ్యములోను గ్రహింపఁ బడకున్నను ఋగ్వేద ప్రాతిశాఖ్యమునందును శుక్లయజుః ప్రాతిశాఖ్యము నందును బరిగణింపఁబడెను.
౨౩౮. ముగ్ధబోధ వ్యాకరణమున ౡకార మంగీకరింపఁబడెను.
౨౩౯. శబ్దకల్పద్రుమకోశమునందు ౡకారము గణింపఁబడెను. తంత్రములందలి దాని యుపయోగము లుదాహరింపఁబడెను. మఱియు, నది యొకశబ్దమనియు దానికిని గోశములలో నర్థములు గలవనియు వ్రాయఁబడెను.
౨౪౦. పాణిని మతమున ఌకారదీర్ఘము లేకున్నను 'ఌతి ౡవేతి' వార్తికముచే ౡకారమే విధింపఁబడెనని శబ్దకల్ప ద్రుమకోశమున సమర్థింపఁబడెను. ఇందు హ్రస్వ ఌకారము విధేయమని ప్రాచీనుల యాశయము.
౨౪౧. లకారద్వయ గర్భిత ఌకారము పై వార్తికములో విధేయమనెడి భట్టోజీ దీక్షిత మతము. ఈ సందర్భమునందలి యహోబల పండితీయములోని యసంగతి.

విషయ సంఖ్య.


౨౪౨. పయి వార్తికమున దీర్ఘ ఌకారము విధేయమనెడి శబ్దకల్పద్రుమ సమన్వయము.

౨౪౩. భట్టోజీ దీక్షిత మతము ననుసరించుచు వాచస్పత్య కోశకర్త పాణినీయ శిక్షలో దుఃస్పృష్ట శబ్దమునకుఁ జేసిన యర్థము.

౨౪౪. వాచస్పత్యకోశకర్త సమన్వయమునందలి యనుపపత్తులు.

౨౪౫. నన్నయ దుఃస్పృష్ట ఌకారముతోనె పంచాశత్సంఖ్యను బూరించెను.

౨౪౬. అనంతామాత్యుఁడు క్ష కారముతోఁ బంచాశత్సంఖ్యను బూరించెను.

౨౪౭. అనంతామాత్యమతమును నిరసించుచు నహోబలపండితులు ళకారముతోఁ బంచాశత్సంఖ్యా పూరణము గావించిరి.

౨౪౮. అహోబలపండితుల మతములోని యసంగతి.

౨౪౯. ఋ ౠ వర్ణా విత్యాదికారికావ్యాఖ్య. ప్రాకృతమున లోపించిన సంస్కృతవర్ణములు. ప్రాకృతమునకు వర్ణములు నలువదియనుటచేత నయితము ఌకారము సంస్కృత వర్ణమనెడి నన్నయాభిప్రాయము దృఢపడుచున్నది.

౨౫౦. ప్రాకృతవర్ణసమామ్నాయమును వేరొక్కనెడి ఋ ౠ వర్ణావిత్యా ద్యప్పకవీయోదాహృత వచన మప్పకవి చెప్పినట్లు హేమచంద్రునిదనుట విశ్వసనీయము కాదు.

౨౫౧. వరరుచి హేమచంద్రాదుల వనుచు నహోబలపతి యుదాహరించిన కారికలును లక్ష్మీధర పండితోదాహృత కారికలును సరియైె యుండలేదు.

౨౫౨. పయి వచనములు మహారాష్ట్రీ ప్రాకృతమునే యుద్దేశించి చెప్పఁబడినవి.

౨౫౩. పయి వచనములందలి లోపములు.

౨౫౪. దుఃస్పృష్టము ప్రాకృతమునలేదు. అయ్యది ప్రాకృతమున ళకారమై కాలక్రమమున లకారముగఁ బరిణమించిన దనుటకు నిదర్శనములు గలవు.

౨౫౫. నన్నయభట్టును మహారాష్ట్రీ ప్రాకృతమునకే వర్ణసమామ్నాయము నలువదియని చెప్పెననుట నిశ్చయము.

౨౫౬. 'అయి ఐ' అను సూత్రము చొప్పున 'ఐ' కార మున్నను ఐకారము లోపించెననుటకు శ్రుతిలేదు. సంస్కృతశబ్దములలోనుండి లోపించినవి పదియని గ్రహింప నగును.

౨౫౭. పయి సమన్వయ పద్ధతినె యనుసరించి యహోబలపతి ప్రాకృతభాషాషట్కము యొక్క వర్ణసమామ్నాయము నలువదియని సాధింపఁజూచెను. అందలి లోపములు.

౨౫౮. అలఘు లకారమును జేర్చి యహోబలపతి పయిరీతిని సమన్వయించుటయు నన్నయాభిప్రేతముకాదు.

౨౫౯. అలఘు లకారము ప్రాకృతమునఁ గలదు. కాని, యది వేఱువర్ణము కాదు.

౨౬౦. 'ళ్లోలః' అనియా? 'లోళః' అనియా? అందలి విధేయము లఘు లకారమా?

విషయ సంఖ్య.

ఆలఘు లకారమా? అందలి విధేయ మలఘు లకారమె.

౨౬౧. షట్త్రింశ దిత్యాదిసూత్రవ్యాఖ్య.

౨౬౨. అచ్చాంధ్రమున వర్గయుక్కులుగలవా? లేవనుట యుక్తము.

౨౬౩. ప్రాకృత సమములో సైత మనాంధ్ర వర్ణఘటిత శబ్దములు లేవు.

౨౬౪. సప్తత్రింశదిత్యాద్యప్పకవీయ పాఠాంతరము ప్రక్షిప్తము. బాలవ్యాకరణ, ప్రౌఢవ్యాకరణకర్తలును, నలఘులకారము గలదని చెప్పియు దానికిఁ బృథగ్గణన మంగీకరింప లేదు. బాలవ్యాకరణ గుప్తార్థ ప్రకాశికా ప్రామాదిక వ్యాఖ్య. ఊళ్లుకాదు. అందలి రెండు లకారములును నలఘువులె. ఈ సందర్భములో బాలవ్యాకరణకర్త ప్రమాదము.

౨౬౫. నన్నయనాఁటి యాంధ్రలిపి చరిత్రము. బాలేంద్విత్యాది కారికల వ్యాఖ్య. అచ్చుల యాకారములు. హల్లుల యాకారములు.

౨౬౬. ఆకాలమునకున్న యాంధ్రకర్ణాటసాధారణలిపి. అందు వర్గయుక్కులకును సరళములకును బ్రత్యేకాకారము లుండెడివి. అజ్ఝల్లులకు గుణితమున మాఱురూపు లుండెడివి.

౨౬౭. ఈ లిప్యుద్ధారక చింతామణికారికలు ప్రక్షిప్తములు కావు.

౨౬౮. ఆంధ్రకర్ణాట సాధారణ లిపినుండి కొన్నిటిని దీసికొని నన్నయ ప్రదర్శించిన యా నూతన లిపియందలి యర్హత. ఘనత. ఔచిత్యము. శాస్త్రసమ్మతి.

౨౬౯. అనుస్వారలిపి విషయకమగు నాంధ్రవిజ్ఞాన సర్వస్వ గ్రంథము. శాసనపద్యమంజరిలోని యావిషయము నందలి గ్రంథము.

౨౭౦. వానిలోని లోపములు. అసంగతులు. అయుక్తములగు సవరణములు.

౨౭౧. ఆంధ్రాక్షర వికాసము. అశోక లిపి. బ్రాహ్మీలిపి. నాగరలిపి. తమిళ కన్నడ లిపులు మున్నగువానిని జూపు పట్టిక.

౨౭౨. నన్నయ కల్పితలిపి జనసామాన్యపు వాడుక కెక్కలేదు. అది యాంధ్రపండితులకుఁ గొందఱకుఁ దెలిసియుండెను.

౨౭౩. నన్నయ యుద్ధరించిన లిపి శ్లోకములం దథర్వణుఁడు చేసిన సవరణములు.

౨౭౪. పొల్లుహల్లుపైని దిర్యగ్రేఖ నిడుట నన్నయనాఁటికే యారంభించినను లాఘవాపేక్షచే నతఁడు దాని నుపేక్షించెను.

౨౭౫. ఈ తిర్యగ్రేఖ తలకట్టు గుర్తని యర్థముచేయుట పొరపాటు.

౨౭౬. అధోదండరేఖ 'ఒత్తు' నకు గుర్తని యథర్వణుఁడు కల్పించెను.

౨౭౭. ఒత్తుగుఱు తాంధ్ర కర్ణాట సాధారణ లిపి యందంత యావశ్యకముకాదు.

౨౭౮. అధోదండరేఖ "ఒత్తు" నకు గుర్తుగ వ్రాయుట పదుమూఁడవ శతాబ్దమున నారంభించినది.

౨౭౯. ఒత్తుగుర్తు నన్నయాథర్వణ కల్పితలిపి మూలకమె యనుట యుక్తము.

విషయ సంఖ్య.


౨౮౦. ఈ లిప్యుద్ధారక కారికలయర్థము వ్యాఖ్యాతలకు సరిగఁ దెలియలేదు.

౨౮౧. "పంచవర్గాదయ" ఇత్యాది కారికల యర్థము తెలియలేదని బర్నెలుదొరగారు వ్రాసిరి.

౨౮౨. ఆంధ్రవిజ్ఞాన సర్వస్వకారులు వీని కపార్థమును జేసికొనిరి. మఱియు నివి నన్నయము లేమో యని సందేహించిరి.

౨౮౩. నన్నయాథర్వణ వర్ణిత లిపి యొకప్పుడు వాడుకలో నుండెడిదని విజ్ఞానసర్వస్వ కారాదులు భ్రమించి వ్రాసిరి.

౨౮౪. నన్నయాథర్వణ లిపి శ్లోకములను జోడించి యొకరీతి నప్పకవి యాంధ్రీ కరించెను.

౨౮౫. అప్పకవి ప్రాచీనలిపి విషయమునఁ జెప్పిన మఱికొన్ని విషయములు.

౨౮౬. బాలేంద్విత్యాది నన్నయకారికలను దెలిఁగించుటలో నప్పకవి యథర్వణుని సవ రణములను సైత మాంధ్రీకరించెను.

౨౮౭. ప్రాచీన లిపిలో నెల్ల స్వరములందును, 'అకార' లిపి సంబంధము గలదని యప్పకవి వింతగఁ గల్పించెను.

౨౮౮. ప్రాచీనశాసనలిపిలో నయితము "ఉత్వ, ఋత్వ" లిపిలోమాత్రము (హల్లుపై నున్నపుడు) తలకట్టు నూరక లిఖించు సంప్రదాయ ముండెడిది. కాని య ద్దానిని నన్నయ యుపేక్షించెను. కాన, నప్పకవి కల్పనము సరికాదు.

౨౮౯. అప్పకవీయ ముద్రణములలోని ప్రాచీనలిపి యున్నట్లు లిఖితమువలె యాదృచ్ఛి క రేఖలుగఁ బడియున్నది.

౨౯౦. వావిళ్లవారి యెడిషనులో సైత మప్పకవిచెప్పిన లిపికి సరియగు నుదాహృ తులు లేవు.

౨౯౧. ఆంధ్రవిజ్ఞాన సర్వస్వకారు లప్పకవ్యభిప్రాయమును గొంతవఱకు గ్రహించిరి కాని, వారి యుదాహృతులందును నపమార్గము కలదు.

౨౯౨. పంచవర్గాదయ ఇత్యాద్యథర్వణకారికల కప్పకవ్యవహారబలపండితులు చేసికొన్న యర్థము. దాని యయుక్తత.

౨౯౩. పైకారికలకు విజ్ఞాన సర్వస్వకారులు చేసిన యపార్థము.

౨౯౪. విజ్ఞానసర్వస్వకారులు పైకారికల కిచ్చిన యుదాహృతులు వారుచేసిన యర్థ మునకు సైతము సరిగలేవు. వావిళ్లవారి ముద్రణములోని ప్రామాదికోదా హరణములు.

౨౯౫. లిపివిషయమున నప్పకవిచెప్పిన మఱికొన్ని విషయముల విమర్శనము.

౨౯౬. వలపలి గిలుక చరిత్రము.

౨౯౭. పదాది యకార వకార లేఖనము నప్పకవి నిరసించుట.

౨౯౮. పూర్ణబిందుపూర్వక వ్యంజన ద్విత్వము మున్నగు ప్రాచీన లిపి సంప్రదాయముల నప్పకవి నిరసించుట.

విషయ సంఖ్య.


౨౯౯. ప్రాచీనశాసన తాళపత్ర మాతృకలలో నుండెడి ప్రాచీనలిపి పద్ధతుల నిరసనము.

౩౦౦. విజ్ఞాన సర్వస్వములోని లిపిచరిత్ర వ్యాససారము.

౩౦౧. బుద్ధునకుఁ బూర్వకాలమున హిందువులకు లిపిలేదనియుఁ దర్వాతఁ బాశ్చాత్యులు ప్రసాదించిరనియుఁ జెప్పెడి పాశ్చాత్యపండితుల యభిప్రాయములు సరికావు.

౩౦౨. వేదకాలమునుండియు హిందూదేశమున లిపి గలదు.

౩౦౩. వర్ణము, లిపి, లేఖనము, అక్షరము మున్నగువానికి విజ్ఞాన సర్వస్వకారులు చెప్పిన వ్యుత్పత్తులు.

౩౦౪. లిపులకెల్ల మూల మనఁబడెడి చిత్రలిపి స్వరూపము.

౩౦౫. తాంత్రిక చిత్రలిపి బ్రాహ్మీలిపికి మూలమను నభిప్రాయము.

౩౦౬. ఆంధ్రలిపియే దేవనాగరలిపికి మూలమనెడి యాంధ్రవాఙ్మయ చరిత్రకారుని వింత యాశయము.

౩౦౭. పై యభిప్రాయము లెల్ల నిస్సారములు. వట్టియూహలు.


## IV. అనుస్వార ప్రకరణము.


౩౦౮. సిద్ధ ఇత్యాది చింతామణి కారికావ్యాఖ్య.

౩౦౯. హ్రస్వాత్పూర్ణోపీత్యాది నియమద్వయము సిద్ధానుస్వార విషయమునందె సార్వత్రికము. సాధ్యవిషయమున ననిర్దిష్ట బిందు విధానమందె చెల్లును.

౩౧౦. సిద్ధఇత్యాదికారికకు బాల సరస్వత్యాదులు చేసిన ప్రామాదిక వ్యాఖ్యలు.

౩౧౧. బాలసరస్వత్యాదుల యట్టి వ్యాఖ్యల విమర్శనము.

౩౧౨. 'సానునాసికోచ్చారణం జేత్' అను ప్రాకృత వ్యాకరణసంప్రదాయము డుజాదుల జేత్త్వ విషయమున నుపయోగించుట సరికాదు.

౩౧౩. పూర్ణము తేలిన రూపము సైత మున్నపుడే హ్రస్వాదిత్యాది సూత్రము వర్తిల్లును.

౩౧౪. పైసూత్రమును సంగ్రహించిన బాలవ్యాకరణపుసందర్భము. దాని విమర్శనము.

౩౧౫. బాలవ్యాకరణ గుప్తార్థ ప్రకాశికాకర్త యీ విషయమున పడిన ప్రామాదికాభిప్రాయము.

౩౧౬. కేతన, చిన్నకోటపెద్దన, యీ విషయమున జాగ్రత్తగా సూత్రించిరి.

౩౧౭. దీర్ఘపూర్వక పూర్ణముగల శబ్దరత్నాకరాది కోశస్థ శబ్దములు; వానివిమర్శనము.

౩౧౮. పూర్ణార్ధబిందు ప్రానవిమర్శనము. దీర్ఘపూర్వకపూర్ణఘటిత శబ్దము లలంతిగఁ (మూండు, పోండి) గలవని యంగీకరించుట యుచితము.

౩౧౯. హ్రస్వపూర్వక పూర్ణము తేలని స్థలములు.

౩౨౦. శబ్దరత్నాకరమునఁ గల యట్టిశబ్దముల పట్టిక.

౩౨౧. నఖండ ఇత్యాద్యధర్వణ కారికావ్యాఖ్య.

విషయ సంఖ్య.

౩౨౨. వైసూత్రమునకు బాలవ్యాకరణకర్త చేసిన వివరణము.

౩౨౩. ఈ యథర్వణ కారికలు సైతము ప్రక్రియోపయోగు లగుచున్నవి.

౩౨౪. హ్రస్వాత్పూర్ణోపీత్యాది చింతామణి సూత్రములును నఖండ ఇత్యాద్యథర్వణ కారికలును నుచ్చారణ భ్రష్టఖండానుస్వార జ్ఞానమునకు సాధకము లగుచున్నవి.

౩౨౫. పూర్ణము ఖండముగఁ దేలుటలోని స్వాభావికత.

౩౨౬. ఆంధ్రభాషా సంస్కారమునాఁటి కర్ధానుస్వారోచ్చారణమును దీర్ఘపూర్వక పూర్ణానుస్వారోచ్చారణమును కొందఱ యుచ్చారణమున నుండెడి వనుటలో సందేహము లేదు.

౩౨౭. అర్ధానునాసికోచ్చారణము కాలక్రమమున నశించుటం జేసి కవులు సఖండ నిర్బిందుకస్థలములకుఁ బ్రాస ప్రయోగము నంగీకరించిరి. కాన, ఖండ పూర్ణరూపద్వయము నంగీకరించినట్లే నిర్బిందురూపాంతరమును నంగీకరించుటుచితము. కాని, లాక్షణికులట్లు చేయక ఖండాఖండ ప్రాసము నంగీకరింపసాగిరి.

౩౨౮. అనంతుని ఖండాఖండప్రాసము సరిగనుండలేదు.

౩౨౯. కూచిమంచి తిమ్మకవి దీర్ఘపూర్వకత్వమునందును హ్రస్వపూర్వకత్వమునందును ఖండాఖండప్రాసము నెల్లెడలను నంగీకరించి ప్రామాణిక ప్రయోగముల నుదాహరించెను.

౩౩౦. అప్పకవీయస్థ ఖండాఖండప్రాస సందర్భ విమర్శనము.

౩౩౧. అప్పకవీయోదాహృతులను గొన్నిటిని దిమ్మకవి యుపేక్షించుటలోని కారణములు. మూకశబ్దము నిర్బిందుకమనియే యప్పకవి యాశయము. ఆఁకరము శబ్దము సార్థ బిందుకము.

౩౩౨. ఒక్క నన్నయ భట్టారకుఁడు మాత్రమె ఖండాఖండ ప్రాసమును బ్రయోగింపలేదు. వీపుశబ్దము నిర్బిందుకము.

౩౩౩. తిక్కనాదులు ఖండాఖండప్రాసము నంగీకరించినవా రగుటచేత వారిప్రయోగములు సఖండ నిర్బిందుక శబ్ద నిర్ణయవిషయమున సాకల్యముగఁ బ్రమాణములు కానేరవు.

౩౩౪. నన్నయ భారత భాగములోని యర్థబిందు ప్రాస ప్రయోగస్థలము లల్పసంఖ్యాకములు.

౩౩౫. నన్నయభట్టు 'వీఁకు' అను నిర్బిందుక శబ్దమును బ్రయోగించినస్థలములందు 'వీఁక' శబ్దమును నిల్పి యాతఁడును ఖండాఖండప్రాసమును బ్రయోగించెనని భ్రమింపరాదు.

విషయ సంఖ్య.

33౬. చీకు శబ్దము సఖండ మను శబ్దరత్నాకరకర్త యాశయము సరికాదు. కాఁగా దానినిబట్టి సాధించిన చీకటిశబ్ద సబిందుకతయుఁ బరాస్తమగుచున్నది.

33౭. కొందఱంగీకరించిన ఖండపూర్ణ ప్రాసము గ్రాహ్యము కాదు. అట్టి ప్రయోగములలో దీర్ఘపూర్వక పూర్ణముల నంగీకరించుటయే యుక్తము.

33౮. దీర్ఘపూర్వక పూర్ణములను నిర్ణయించు నవ్యభిచరిత ప్రమాణములు లేమింజేసి కావలయుఁ బ్రాచీనులు రేఫ ఱకార విషయమునందు వలె నీ విషయమున గాఢ పరిశీలనము చేయలేదు.

33౯. శబ్దరత్నాకరకోశ కర్త సఖండ శబ్దముల కిచ్చిన ప్రమాణములుసరియైనవి కావు. ఈ విషయమునందలి మార్గాంతరములు.

3౪౦. ప్రాచీన శాసన లేఖనములును దాళపత్ర మాతృకల లేఖనములును దప్పుల తిప్పలును ననియత నియమకములును నగుటచే నవి సాకల్యముగాఁ బ్రమాణీకరింపఁ దగినవి కావు

3౪౧. ప్రాచీన శాసనలేఖనపద్ధతులు కాలక్రమమున మాఱుచు వివిధరీతుల వెలసినవి. మొట్టమొదట బిందువుచోట వర్గపంచమములు వ్రాయఁబడెడివి.

3౪౨. తొమ్మిదవశతాబ్దమునాఁటికి జ మలచోట బిందువు వ్రాయఁబడెడి సంప్రదాయ మంకురించెను.

3౪3. ప్రాచీనతమ కాలమున నరసున్నలను లేదా వానిచోట నిండుసున్నలను లేదా వర్గపంచమములను వ్రాసెడి సంప్రదాయమే లేదు.

3౪౪. కన్నడమందువలెనె యర్ధానుస్వారము లుపేక్షింపఁ బడెడివి. ప్రాచీనకాలము లోని యింద్రగణములు వేఱురీతి నుండెడివి. వానిలో గగ మగణాదులును నుండెడివి. వానిని గ్రహింపక యరసున్నలచోట నిండుసున్నలు వ్రాయఁ బడెడివని భ్రమించుట సరికాదు.

3౪౫. శాసన పరిష్కర్తలు ప్రతిబింబములలో లేని బిందువులను నిల్పఁజూచుట సరికాదు. ఉన్న బిందువులను లేనివానిగ భావింపవలె ననుటయు సరికాదు.

3౪౬. యుద్ధమల్లుని బెజవాడశాసన కాలమునకు సైతము ఖండముచోటఁ బూర్ణమును గాని, దానికి బదులుగ వర్గపంచమమునుగాని వ్రాయు సంప్రదాయము రాలేదు. శాసన పరిష్కర్తలు బెజవాడ శాసనలిపిని నేఁటి తెల్గులిపితో వ్రాసిచూపుటలోఁ జాల ప్రమాదములు గలవు.

3౪౭. నన్నయభట్టారకుఁడు ఖండము నాంధ్రమునఁ బ్రతిష్ఠించిన పిమ్మటనె యీ ఖండ పూర్ణవ్యావర్తక లిపిపద్ధతి యంకురింపసాగెను.

3౪౮. పైకారణములచే యుద్ధమల్లుని శాసనములోని బిందువులును వానిచోటి యనునాసికములును సాకల్యముగఁ బూర్ణములె యనఁదగును

3౪౯. యుద్ధమల్లుని శాసనములోని ఫలబు మున్నగు బు వర్ణకముచోట ము వర్ణకమును బఠించుట సరికాదు.

విషయ సంఖ్య.


౩౫౦. రేఫపూర్వక సంయోగములోని హల్ద్విత్వరూప కర్ణాట పద్ధతియె యీ పూర్ణబిందుపూర్వక హల్ద్విత్వ పద్ధతికి మూలము కానోపును.

౩౫౧. 'ఐ = అయ్' అనునది తమిళభాషా సంప్రదాయమువంటిది.

౩౫౨. శాసనాదులలోని యర్వాచీనమగు పూర్ణబిందుపూర్వక హల్ద్విత్వపద్ధతియు నవ్యభిచరితమై యుండలేదు.

౩౫౩. ఖండానుస్వారమును నిర్ణయించు శబ్దరత్నాకర కోశపద్ధతులును ప్రామాణికములు కానేరవు.

౩౫౪. ప్రకృతి వికృతి శబ్దములందును సబిందు నిర్బిందుకతా వ్యత్యాసము కలదు. ద్రావిడభాషలలోని పరస్పర సంబంధము గల శబ్దములందును నట్టి వ్యత్యాసము కలదు.

౩౫౫. ద్రావిడభాషలలోని సబిందు నిర్బిందుకతా వ్యత్యాసము గల శబ్దముల పట్టిక.

౩౫౬. ద్రావిడభాషలలోని సానునాసికపదముల సంబంధమును జూపు శబ్దముల పట్టిక.

౩౫౭. ద్రావిడభాషలలోని యనుస్వారస్థితి.

౩౫౮. న మ పరకత్వమున ద్రుతమున కనుస్వారాదేశమగు నను నప్పకవిమతము.

౩౫౯. తత్సమ పదమధ్యమున నైతము పరుష సరళ పరకత్వమున బిందువునకు వర్గ పంచమాదేశము రాదని యాంధ్రపండిత హ్యాపయము.

౩౬౦. ఆంధ్రమహాకవి ప్రాస ప్రయోగములు వర్గపంచమాదేశ నిరాసమునకుఁ బ్రమాణము లగుచున్నవి.

౩౬౧. వర్గపంచమాదేశ సరళాదేశముల యర్వాత. వాని స్వాభావికత.

౩౬౨. స్వాభావికములగు పరిణామములకును గొంతకాల వ్యవధానము కలుగుచుండుట యనుభవసిద్ధము.

౩౬౩. కావుననె మూలద్రావిడభాషలో లేని దనఁదగు వర్గపంచమాదేశము తమిళము మున్నగువానియందు సంస్కృతమందువలెనె ప్రవేశించినది. అట్లు వచ్చినను దత్సహభావి యనఁదగు సరళాదేశము కొన్నియెడల ద్రావిడభాషలలో రాదయ్యెను.

౩౬౪. వర్గపంచమ పరుషసంయోగము ద్విరుక్తపరుషముగ నేర్పడుట తమిళమున విస్తరించియున్నది.

౩౬౫. అర్వాచీన తమిళములోని సరళోచ్చారణ వైశాల్యము.

౩౬౬. ఆంధ్రకర్ణాటముల సంస్కారకాలమునకు సరళోచ్చారణ మా భాషలలో వెలసియుండెను.

౩౬౭. సంయోగములోని వర్గాక్షర పరకద్రుతము నైతము తత్తద్వర్గపంచమముగాఁ దెల్గున మాఱుటలేదు. ఇందులకుఁ బ్రయోగములు.

విషయ సంఖ్య.


౩౬౮. వర్గాక్షర పరకద్రుతము కాలక్రమమున ననుస్వార మగుచున్నది. అట్టి యను స్వార మర్ధమాత్రిక నకారజన్యమె యైనను హ్రస్వపూర్వకత్వమున మాత్రిక మగుచున్నది.

౩౬౯. అర్ధబిందు పరిణతి విశేషములు, బిందువు తేలుటలోని యుపపత్తులు, నుడి తొలి యచ్చుమీఁది పూర్ణము తేలకుండుట కుపపత్తులు.

౩౭౦. అవసానగత నమలు కొన్నియెడల లోపించునపు డవ్వియును బిందుపరిణతి ద్వారముననే లోపించుచున్న వనఁదగియున్నను, నాంధ్రు లట్టి బిందు పరిణామమును సూత్రింపలేదు. ప్రాకృతకర్ణాటములలో నట్టి బిందుపరిణతి మిక్కిలి విశాలముగ నున్నది.

౩౭౧. సమాన పదమధ్యగ తానునాసికములు బిందువులై తేలుచుఁ గాలక్రమమున లోపించును. అట్టి యనునాసికములు ద్రావిడభాషలలో నొక్కొకదాని యందు, నొక్కొక యవస్థలో నుండుటయుఁ గలదు. అట్టి శబ్దముల పట్టిక

V. అంతస్థప్రకరణము.

౩౭౨. లఘువోఽలఘువ ఇత్యాది సూత్రవ్యాఖ్య.

౩౭౩. యవల లఘ్వలఘుతలను జూపుటకు బాలసరస్వ త్యప్పకవులు "హలి సర్వేషా" మ్మను పాణినీయసూత్రమును జూపుట సరికాదు. అహోబలపతి చూపిన "వ్యోర్లఘుప్రయత్నే" త్యాది సూత్రమె సరియై యున్నది. అలఘుశబ్దము నకుఁ బర్యాయముగ నీ విషయమున గురుశబ్దమును వాడఁబడుచున్నది.

౩౭౪. లకారద్వైవిధ్యము ప్రాకృతవ్యాకరణ ప్రసిద్ధము. అంతస్థములు శాల్గిటికిని లఘ్వలఘుభేద మాంధ్రమునఁ గలదని చింతామణి చెప్పుచున్నది.

౩౭౫. స్వరసంహితలో నుచ్చారణ సౌకర్యార్థముగ వచ్చు యకారము లఘువని సంస్కృత ప్రాకృత వ్యాకరణానుసారముగఁ జింతామణియుఁ జెప్పుచున్నది.

౩౭౬. లఘు వకార మిట్టి దని చింతామణి చెప్పలేదు. బాలసరస్వత్యాదులు ప్రథమమీఁది పకారమున కాదేశమగు వకారము లఘువని వ్యాఖ్యచేసిరి. అది సరికాదు. యకారతుల్యన్యాయమున సంహితలో నాగమముగా వచ్చు వకారమె లఘువనుట యుక్తము. అట్టిది తెల్గున మిక్కిలి యరుదు. ఈ సందర్భమున నప్పకవీయములోని సందర్భ మసంగతముగ నున్నదని తత్టీకా కర్తలు చెప్పుట సరికాదు.

౩౭౭. ర ల ల, లఘ్వలఘుతలు యవలవంటివి కావు.

౩౭౮. అట్లయినను లఘ్వలఘు యవలకువలెనె ద్వివిధ లకారములకును యతిప్రాస మైత్రిని సంస్కృత పండిత మతానురోధమునఁ జింతామణి యంగీకరించు చున్నది.

విషయ సంఖ్య.


౩౭౯. ప్రాచీన కర్ణాట పండితులు ఱళ క్షళ ళళములకు యతిప్రాసమైత్రి నంగీక రింపలేదు. వర్ణసమామ్నాయగత ద్రావిడ మూర్ధన్య ళకార ఘటితశబ్దము లయుఁ, దత్సంబంధి తమిళ కర్ణాటశబ్దములయుఁ బట్టిక.

౩౮౦. ల ళ ల తుల్యన్యాయమున ర ఱ ల మైత్రి యంగీకరింపఁదగినదే యైనను న ట్లంగీకరింపమికిఁ దమిళ కర్ణాట మహాకవి సంప్రదాయము మూలమనఁ దగును.

౩౮౧. రఱలకుఁ బ్రాచీనకాలమున మిక్కిలిగ నుచ్చారణ వైజాత్య ముండెడిది.

౩౮౨. ద్రావిడభాషలలోని ఱకారపు ప్రాచీనోచ్చారణము టకారావిష్ట రూపముగ నుండెడిది.

౩౮౩. రఱల యతిప్రాస వైరవిషయమునఁ బ్రాచీనులకుఁ గల పట్టుదల.

౩౮౪. నన్నయభట్టునాఁటికే రఱల స్థానభేద మంతరించెననుటకు వానికాతఁడు లఘ్వలఘుతాభేదమాత్రమును సూత్రించుటయె ప్రబలనిదర్శన మగుచున్నది.

౩౮౫. అధర్వణునినాఁటి కట్టి లఘ్వలఘూచ్చారణభేదమును సడల నారంభించెను.

౩౮౬. అధర్వణుఁడు సూత్రించిన రేఫ ఱకారముల యనుగమములు నన్నయభట్ట భారతభాగస్థ యతిప్రాస స్థలమాత్ర మూలకములు.

౩౮౭. ప్రాచీనశాసనములలోని రేఫ ఱకారలేఖనము ప్రమాణీకరింపఁ దగినదికాదు.

౩౮౮. లాక్షణికులు ర ఱ ల నిర్ణయము విషయమున భాస్కరునివంటుకుఁ గల మహా కవుల ప్రయోగములను వాని కవిరుద్ధములగు నర్వాచీనమహాకవిప్రయోగము లను బ్రమాణీకరించి యున్నారు. కూచిమంచి తిమ్మకవి శ్రీనాథాది మహాకవిప్రయోగములను నైతమీ విషయమునఁ బ్రమాణీకరించియు వారి ప్రయోగములను గొన్నిటిని విమర్శించినవాఁ డయ్యెను.

౩౮౯. నన్నయేతర మహాకవులు కొన్ని శబ్దములలో ర ఱ ఘటితద్వైరూప్యమును బ్రయోగించి యున్నారు. అట్టియెడల మహాకవి ప్రయోగములకే ప్రామా ణ్యామొసంగుట సిద్ధాంతమగుటచే, నట్టి ద్వైరూప్యమునకు లాక్షణికులు ప్రామాణ్యము నంగీకరించిరి.

౩౯౦. ఈ విషయమున నిట్లే శబ్దరత్నాకరకర్త వ్రాసియున్నాఁడు. ఆముక్తమాల్యద రేఫ ఱకార సాంకర్యమును జేయున దనుట సరికాదు.

౩౯౧. రేఫ ఱకార వైరమును బాటించు నభిప్రాయమును గనుపఱుచు ప్రయోగములు కనఁబడునపు డట్టి మహాకవులగ్రంథములలో రేఫ ఱకార సాంకర్యము గల దనుట సరికాదు.

౩౯౨. క్రియాంత ఇత్యాది సూత్రవ్యాఖ్య.

౩౯౩. క్రియాంత ఇత్యాది కారికలు నన్నయ భారతభాగ పద్య యతిప్రాసస్థలస్థిత రేఫ ఱకారవర్ణన మాత్రపరములు.

విషయ సంఖ్య.


౩౯౪. తాళ్లపాకము పెదతిరుమలయ్య ప్రభృతు లీ యధర్వణసూత్రములలోని వరుసనె యనుసరించి రేఫ ఱకార ఘటితశబ్దముల నుపదేశించిరిగాని, మాతృకాపాఠ క్రమము ననుసరించి యుపదేశింపలేదు.

౩౯౫. తిరుమలార్యప్రభృతులు తమతమ కాలమువఱకుఁ గల మహాకవి ప్రయోగముల నెల్ల మూలముగఁ గొని రేఫ ఱకార నిర్ణయము చేసిరి.

౩౯౬. తిరుమలా ర్యాప్ప కవుల కాలము.

౩౯౭. శకటరేఫ నిర్ణయ మను గ్రంథమునైతము ద్వివి ధాది దుత ఇత్యా ద్యధర్వణ కారికాఛాయానుకారియె.

౩౯౮. శటరేఫనిర్ణయ గ్రంథకర్తయగు భారతము లక్ష్మీపత్యవధాని కాలము.

౩౯౯. కూచిమంచి తిమ్మకవియు ద్వివి ధాది దుత ఇత్యాది సూత్రార్థమునె యనుసరించెను. కాని ముద్రణ సంస్కర్తలు వాని, యర్థమును గ్రహింపఁ జాలక కావలయును, వానిని బ్రమాద భూయిష్ఠముగ ముద్రించిరి.

౪౦౦. తిరుమలయ్యగారును ద్వివి ధాది దుతశ్చ స్యు రిత్యాద్యధర్వణ కారికా ఛాయనె యనుసరించిరి. గాని యందును దప్పులు ముద్రాపకులమూలమున ననేకములు ప్రవేశించినవి.

౪౦౧. ఇందుల కప్పకవీయ రచనము చాల సహకారి యగుచున్నది.

౪౦౨. ద్విరేఫవర్ణదర్పణ కర్తయగు రంగనాథ కవి, క్రియాంత ఇత్యాది కారికలు నన్నయప్రయోగమాత్ర మూలకములని గ్రహింపక సకలాంధ్ర మహాకవి ప్రయోగపరములనుగా వానిని సమన్వయించెను. అది సరికాదు. ఇతఁడీ కారికల నహోబల పండితీయమునుండి తీసి యుదాహరించెను.

౪౦౩. క్రియాంతే చాన్యవర్ణేచేత్యాదికారికకు రంగనాథకవి చేసిన యర్థము సరికాదు.

౪౦౪. అట్లే ద్వివి ధాది దుః శ్చ స్యు రిత్యాది కారికలకును రంగనాథకవిచేసిన యర్థము సరియై యుండలేదు.

౪౦౫. 'అయవో' అను దానికి ద్వివిధ శబ్దము విశేషణముగ రంగనాథకవి యన్వయించుట సరికాదు. ఇంకను నిచట చాల నపార్థములు గలవు.

౪౦౬. నన్నయభారతభాగ యతిప్రాస స్థలస్థిత నామ ప్రత్యయ రేఫములు.

౪౦౭. నన్నయభారత యతిప్రాసస్థిత సంయుక్తరేఫములు.

౪౦౮. నన్నయభారత యతిప్రాసస్థిత ప్రకృతిగత రేఫములు.

౪౦౯. నన్నయభారత యతిప్రాస స్థలములలో ద్విత్వరేఫ మొక్క చోటను మాత్రమె గలదు.

౪౧౦. నన్నయభారత యతిప్రాసస్థిత ఱకారములు.

విషయ సంఖ్య.


౪౧౧. పయి నన్నయభారత యతిప్రాస స్థలస్థితరేఫ ఱకార శబ్దములను బరిశీలించు నపుడు పై యథర్వణ కారికలు నన్నయ ప్రయోగమాత్ర మూలకములని విశదము కాకమానదు.

౪౧౨. 'ఆఱు = ఉపశమిల్లు, ఆరు = నిండారు' అని నన్నయ హృదయము.

౪౧౩. నన్నయభారత యతిప్రాసస్థలములలో నెచ్చటను బదాదిశకటము లేదు. రేఫమునకుఁ దర్వాత సైతము శకటము లేదు. కాన, 'నమరా' అను పాఠము సరికాదు. 'నమవా' అనుపాఠమె యుక్తము.

౪౧౪. నన్నయ యతిప్రాస స్థలములలో జకాకారపూర్వక రేఫ ఱకారములు రెండును లేవు. సకార బకార పూర్వక రేఫములు గలవు. అట్టి శకటములు లేవు.

౪౧౫. విభక్తి ప్రత్యయములలో ఱకారము నన్నయప్రయుక్తము కాదు. 'అందొఱు' మున్నగువానిలోని ఱకారము విభక్తియని నన్నయాథర్వణు లంగీకరింపలేదు.

౪౧౬. హలంతరపరక ఱకార సంయోగము లేదు. ఈ విషయమున నన్నయభారత ప్రయోగము లొక్క పద్యమునమాత్రము (ప్రాసగతములు) గలవు.

౪౧౭. హలంతర సంయోగమున శకటము నిలువ నేరదు.

౪౧౮. నన్నయ ప్రయోగములలోని యా ప్రాసగత రేఫ సంయుక్తము లసంయుక్తావస్థలో లఘురేఫ యుక్తములేయని తిక్కయజ్వ ప్రయోగములు విశదీకరించుచున్నవి.

౪౧౯. అలఘురేఫము లుప్తాచ్క మగుచో లఘురేఫముగా మాఱునని ప్రౌఢవ్యాకరణమున సూత్రింపఁ బడెను.

౪౨౦. హలంతర సంయుక్త ఱకారము లుండవచ్చుననియు నట్టియెడ వానికి రేఫముతో మైత్రి సమ్మతమనియుఁ జెప్పెడి తిమ్మకవి మతము సరికాదు.

౪౨౧. హలంతర సంయోగమున నలఘువు లఘురేఫముగ మాఱు ననుటయె యుక్తము.

౪౨౨. అలఘు రేఫము హలంతర సంయుక్త మగునపుడు క్వాచిత్కముగ విభాషను లఘురేఫ మగు ననెడి రంగనాథకవి మతమును సరికాదు.

౪౨౩. శకటరేఫ నిర్ణయకర్తయగు భారతము లక్ష్మీపత్యవధాని హలంతర సంయోగమునఁ, బదాదిని, దీర్ఘపూర్వకత్వమున, ఱకార ముండ నేరదని, సిద్ధాంతీకరించెను. దీర్ఘపూర్వక లఘురేఫము హ్రస్వపూర్వక మయ్యె నేని యది యలఘువుగ మాఱునని సాధించెను.

౪౨౪. ద్విత్వములోని శకటములె యనుట సర్వ సమ్మతము. అందొకటి లోపించినను బరిశిష్టము శకటమె యగునని యడిదము సూరకవి చెప్పెను.

౪౨౫. దీర్ఘపూర్వకము శకటము కాదనెడి పక్షమును లక్ష్మీపత్యవధాని సాధించినపద్ధతి. ర ఱ లకు యతిమైత్రి చెల్లుననియుఁ బ్రాసమైత్రి చెల్లదనియుఁ జెప్పెడి మతములు.

విషయ సంఖ్య.


౪౨౬. వెల్లంకి తాతంభట్టు తనకవి చింతామణిలో నీ విషయములనె విశదీకరించెను.

౪౨౭. ఇట్టి సమూలక విషయముల నప్పకవ్యాదులు నిరసించుట సరికాదు.

౪౨౮. అడిదము సూరకవి సైత మప్పకవ్యాదుల ననుసరింపలేదు.

౪౨౯. దీర్ఘపూర్వక శకటములుండ నేరవనుట సరికాదు. అట్టివి యితర ద్రావిడ భాషలందును గలవు.

౪౩౦. నన్నయ తద్భవములలో శకట రేఫములు లేవు. శకటరేఫ నిర్ణయ గ్రంథ కర్తయుఁ దద్భవములలో శకటము లుండవనియె చెప్పెను.

౪౩౧. 'అఱ, పెఱ, కఱకంఠుఁడు' అనునవి అకారయుతము లగునపుడు దేశ్యములు. నన్నయ వీనిని దేశ్యములనియే తలంచియుండును.

౪౩౨. నన్నయేతరకవులు తద్భవములందు ధారాళముగా అకారములను బ్రయోగించి యున్నారు. గొఱియశబ్దము దేశ్యము.

౪౩౩. నన్నయేతరకవుల గ్రంథములలో గురు లఘు వ్యత్యాసమును గలదు. అనఁగా నుభయరేఫక శబ్దములును గలవు.

౪౩౪. లఘుర్భవేదిత్యాది కారికావ్యాఖ్య. దీనికి ఛందఃపరముగఁ జేసిన యాధునిక వ్యాఖ్య; దాని నిరాకరణము.

౪౩౫. దీనికిఁ బ్రౌఢవ్యాకరణకర్త చేసిన వివరణము సరికాదు.

౪౩౬. తన నాఁటికిఁ గొన్ని శబ్దములలో రేఫ అకారముల ద్వైరూప్యము కనఁబడినపు డట్టి ద్వైరూప్యము నంగీకరించెనేగాని, యథర్వణుఁడు వాని యతిప్రాస మైత్రి నంగీకరింపలేదు.

౪౩౭. తమిళ కర్ణాట పండితులు రేఫ అకారయుత శబ్దపరిశోధనమును జేసియుండ లేదు.

౪౩౮. ఆంధ్రపండితు లట్లుగాక రేఫ అకార పరిశోధనము గాఢముగఁ జేసియున్నారు.

౪౩౯. అథర్వణుఁడు నన్నయభారత యతిప్రాస ప్రయోగములను మాత్రమె బాగుగఁ బరిశోధించెను.

౪౪౦. తాళ్లపాకము తిరుమలయ్య యీ విషయమున మొట్టమొదట గొప్ప పరిశోధనము చేసెను. తర్వాత నప్పకవి యా మార్గమునె విస్తరిల్లఁ జేసెను.

౪౪౧. తిరుమలయ్యాప్పకవుల రేఫ అకారనిర్ణయ పద్ధతులు. కూచిమంచి తిమ్మకవియు వీరికిదప వీరిపద్ధతులనె విస్తరిల్లఁజేసెను.

౪౪౨. బద్దెపూఁడి భద్రన్న, గణపవరపు వేంకటకవి, చేసిన రేఫ అకార నిర్ణయ పద్యము లసమగ్రముగ నాకు లభించినవి.

౪౪౩. ఓగిరాల రంగనాథకవి, బహుజనపల్లి సీతారామాచార్యులు చేసిన రేఫ అకార పరిశోధనము.

౪౪౪. నన్నయభట్టు ద్విరేఫకశబ్దాంగీకారము చేయలేదు. తక్కినవా రెల్ల రేఫ అకార ఘటిత రూపద్వయము నంగీకరించిన వారె యనఁదగును.

విషయ సంఖ్య.

౪౪౫. లఘువశ్శాఖి శ్శైలేత్యాది కారికల వ్యాఖ్య. శకటరేఫ నిర్ణయకర్త పై కారికల యర్థమును జాలవఱ కనుసరించెను.

౪౪౬. శకటరేఫ నిర్ణయ గ్రంథకర్త చెప్పిన రేఫ ఱకార విషయకములగు మఱికొన్ని సూత్రములు. వీనిలో ననేకములు ద్విరేఫవర్ణదర్పణకర్తచే సంగ్రహింపఁబడెను.

౪౪౭. కేచిద్వదంతీత్యాది కారికావ్యాఖ్య.

౪౪౮. అనిశ్చయ ఇత్యాది కారికావ్యాఖ్య.

౪౪౯. లఘువశ్శాఖీత్యాది కారికార్థ విషయమున ద్విరేఫవర్ణదర్పణకర్త యభిప్రాయము.

౪౫౦. రేఫ ఱకారశబ్ద సంఖ్యా గణనరూప మగునట్టి ద్విరేఫ వర్ణదర్పణకర్త వ్యాఖ్య సరిగ్గా యుండలేదు.

౪౫౧. రేఫఱకార ఘటిత శబ్దములలో ముఖ్యము లగువానిని జూపెడి వక్ష్యమాణ పట్టిక లోని సంజ్ఞాది వివరణము.

౪౫౨. ముఖ్యములగు శబ్దముల పట్టిక. వానిలోని కొన్నిటి విమర్శనము.

౪౫౩. ౧. అఱ-అర - అను శబ్దముల విమర్శనము.

౪౫౪. ౨. అఱమర - అరమర ,,

౪౫౫. ౩. అఱవఱలు - అరవరలు ,,

౪౫౬. ౪. అఱుఁగు - అరుఁగు. ,,

౪౫౭. ౫. ఆఱు - ఆరు = ఉపశమిల్లు. ,,

౪౫౮. ౬. ఊఱు - ఊరు = నీరూఱు ,,

౪౫౯. ౭. ఎఱఁగు - ఎరఁగు = దిగు, మ్రొక్కు. ,,

౪౬౦. ౮. ఒరయు - ఒరపెట్టు = రాచు ,,

౪౬౧. ౯. కరఁగు - కఱఁగు = ద్రవించు ,,

౪౬౨. ౧౦. కురులు - కుఱులు ,,

౪౬౩. ౧౧. కెఱయుట = విజృంభించుట ,,

౪౬౪. ౧౨. కొఱప్రాణము - కొరప్రాణము ,,

౪౬౫. ౧౩. కొరడా ,,

౪౬౬. ౧౪. కొరడు - కొఱడు ,,

౪౬౭. ౧౫. క్రమ్మఱు - క్రమ్మరు ,,

౪౬౮. ౧౬. గరగరిక - గఱగఱిక = నైర్మల్యము ,,

౪౬౯. ౧౭. చఱువు = హవ్యము ,,

౪౭౦. ౧౮. చీరు - చీఱు ,,

౪౭౧. ౧౯. చెఱఁగు - చెరఁగు ,,

౪౭౨. ౨౦. చేకూరు - చేకురు - చేకూఱు - చేకుఱు ,,

విషయ సంఖ్య.


౪౭౩. ౨౧. చేర - చేఱ = (ప్రవృతి) శబ్దముల విమర్శనము.
౪౭౪. ౨౨. తారు - తాఱు ,,
౪౭౫. ౨౩. తిరి - తిఱి, తిరుగలి - తిఱుగలి ,,
౪౭౬. ౨౪. తిరుగు - తిఱుగు ,,
౪౭౭. ౨౫. తీఱు = నశించు, తీరు = చక్కఁబడు ,,
౪౭౮. ౨౬. వాతెఱ - వాతెర - తెఱ, తెర ,,
౪౭౯. ౨౭. తేఱు - తేరు = తేటపడు ,,
౪౮౦. ౨౮. తొరలు - తొఱలు ,,
౪౮౧. ౨౯. తొరఁగు - (తొరుఁగు) తొఱఁగు ,,
౪౮౨. ౩౦. నెరయు - నెఱయు ,,
౪౮౩. ౩౧. నెఱి - నెరి ,,
౪౮౪. ౩౨. పరి - పఱి. ,,
౪౮౫. ౩౩. పఱుసఁదనము - పరుసఁదనము. ,,
౪౮౬. ౩౪. పాఱు - పారు. ,,
౪౮౭. ౩౫. పెఱుఁగు - పెరుఁగు. ,,
౪౮౮. ౩౬. బిఱుసు - బిరుసు. ,,
౪౮౯. ౩౭. మఱగు - మరగు. ,,
౪౯౦. ౩౮. మారిమసఁగు - మాఱిమసఁగు. ,,
౪౯౧. ౩౯. మాఱు - మారు. ,,
౪౯౨. ౪౦. ముందఱ - ముందర. ,,
౪౯౩. ౪౧. ముచ్చిఱి - ముచ్చిరి. ,,
౪౯౪. ౪౨. రంతు - ఱంతు. ,,
౪౯౫. ౪౩. రాగిల్లు, రూపించు, రీతి, మొ॥ ,,
౪౯౬. ౪౪. ఱాచు - రాచు; రాపు. ,,
౪౯౭. ౪౫. ఱేవు - రేవు. ,,
౪౯౮. ౪౬. ఱోయు - రోయు. ,,
౪౯౯. ౪౭. ఱోలు - రోలు. ,,
౫౦౦. ౪౮. వేమాఱు - వేమారు - వేమఱు - వేమరు. ,,
౫౦౧. ౪౯. వేఱు = వేరు. ,,
౫౦౨. ౫౦. సుఱసుఱ - సురసుర. ,,
౫౦౩. అద్య ఇత్యాది కారికావ్యాఖ్య. ,,
౫౦౪. సంస్కృతములోని లఘుయవలు. తమిళకర్ణాటకములలోని స్వర వ్యవధాయక వర్ణములు; వానియందలి ప్రకృతిభావములు.

